దలచి నమస్కరించి భవతారకముత్తమ మద్వితీయమిా
స్థలము చరాచరాత్మక రసావలయంబుననంచు నెంచుచున్. ౪౭

చ. అరయఁగ క్షేత్రదర్శన మహత్త్వముచేతనె ముక్తినిచ్చు నీ
శ్వరుఁడు సమస్తపాపములఁ జక్కనడంచుచు ధ్యానయోగముం
నరులకుఁ గూర్చునందువలనన్ హరిరూపముదాల్చి భక్తుల
క్షరమగుమోక్షముం బ్రతియుగంబునఁ బొందుదురింతనిక్కమే

గీ. అఘవినాశన చణతధర్మార్థకామ
దాననైపుణిముక్తిసంధానగరిమ
మమలమైవెల్గు గోష్ఠీవనమునఁగల్గు
నుత్తమాంకంబులంచు నేనూహగొనెద. ౪౯

క, స్పష్టముగనిట్లు మానస
దృష్టిన్నిర్ధారణంబు తేజరిలంగా
నష్టాక్షరీమనూక్తిని
ప్రష్టతపంబును బొనర్చెసమధిక భక్తిన్. ౫౦

గీ. శంఖచక్రగదాధరు సరసిజాక్షు
హరిని మనమందునిల్పి యష్టాక్షరీ మ
నువుజపించుచు నూర్వేలనూర్లసార్లు
జపమొనర్చెను సరసిజసంభవుండు. ౫౧

సీ. భగవంతుఁడను మనోభవకోటిసుందరుండతి
దీప్యమానుండు నబ్జశంఖ
చక్రగదాన్వితచారు చతుర్భుజుండ మల
పీతాంబరుం డచ్యుతుండు
వనమాలికోల్లసద్వక్షస్స్థలుండును శ్రీవత్స
చిహ్నుండు శ్రీధరుండు
నవ్యకిరీటకుండల ధారిచందన చర్చితాంగుఁడు
విభూషణ విరాజి.

గీ. హారనూపురకటి సూత్రధారి బ్రహ్మ
సూత్రధారియుఁ బరమపవిత్రమూర్తి
వైనతేయునధిష్ఠించి పరమగోష్ఠి
వనమునందున సస్మితవదనుఁడగుచు గీ౧

సీ. స్వర్ణభూషణరాజి సమలంకృతానర్ఘ్య
చామరానిలములు సందడింప
శ్రీభూమినీలా కుశేశయనేత్రలు
నిత్యముక్తులతోడ నియతిఁగొలువ
అందమౌభక్తితో నందసునందాదు
లోకపంకజోహారు లొసఁగుచుండఁ
గొమరొప్పగుముదాక్ష కుముదాదికాసంఖ్య
భక్తోత్తములు వెంట బలసికొలువఁ

తే. బరముఁడు సనాతనుఁడు పరబ్రహ్మమూర్తి
విశ్వపతి విశ్వహేతువు విశ్వమయుఁడు
పద్మసంభవునకుఁ బురోభాగమందుఁ
గనులవిందుదలిర్ప సాక్షాత్కరించె. గీ౩

ఉ. కాంచియటుల్ రమేశునవ కంజదళాక్షుని దేవదేవురో
మాంచితగాత్రుఁడై ప్రణమితాంగుఁడునై భువిదండమట్లు రె
ట్టించి నమస్కరించుచు ఘటించిప్రదక్షిణముల్ మఱిమఱి
గాంచనగర్భుఁడిట్లు స్తవనంబొనరించె లలాటహస్తుఁడై. గీ౪

సీ. పరమేశుఁడు ననన్తపరమశక్తియుఁ బరబ్రహ్మయు
నగు నీకువందనంబు
జానతముండును సచ్చిదానందమయుండునౌ
నీకునాదండమయ్య
వాచ్యుండు మఱియు నవాచ్యుండు నిర్విశేషుఁడు
శేషుఁడగు నీకు శుద్ధవినతి

వ్యద్రూపియు నరూపినగుణుండు నిర్గుణుండగు
నీకునాదు సాష్టాంగమయ్యె.

గీ. శశ్వదానందమయుఁడును సత్స్వరూపుఁ
డమలచిన్మయుఁడ తులసహస్రమూర్ధ
బాహుయుక్తుఁడు దశశతపానయుతుఁడు
విశ్వచక్షుండవగునీకు వేయునతులు. ౫౪

సీ. విశ్వరూపుండును విశ్వాధిపతి యచ్యుతుండును
నిర్వికారుండునా ర్త
నాథుండు లక్ష్మీసనాథుండు సద్భక్తకామ్య
ప్రదాయి లోకప్రభుండు
లోకరక్షణసుశీలుఁడు శేషపర్యంకశాయి
యువనమాలి సర్వశక్తి
వాత్సల్యగుణుఁడును వాసుదేవుండును శ్రీభూమి
నీలాప్రసేవితుండు.

గీ. శంఖచక్రగదాపద్మ సహితుఁడతుల
దుష్టసంహారి యాశ్రితశిష్టపారి
జాతమును దివ్యభూషణ సంస్కృతాంగుఁ
డై వెలింగెడునీకు జోహారులంఘ్రి. ౫౬

గీ. సులభుఁడు నుగమ్యుఁడును దివ్యశోభనుండు
స్రగ్వరాంబరధారియుఁ జందనైక
లిప్తదేహుండు రుచిరసందీప్తతనుఁడు
ఘనుఁడునౌనీకు నానమస్కారమిదియె. ౫౭

క. శరణాగతుఁడను బుత్రుఁడఁ
బరులను సేవింపఁ బాహిపాహివరజ క
త్వరణుఁడనీ వేగతియని
సరసిజసంభవుఁడు స్తవమునలుపుచు నిట్లుల్. ౫౮

గీ. శ్రీధరుని సన్నిధానంబుచేరి మౌన
ముద్రఁదాల్చెను నంత నామురహరుండు
వత్సలతఁబూని తనపాణిపల్లవముల
మేనునిమిరెను దత్పద్మయోనికపుడు. ౫౯

గీ. అభ్రగర్జలఁబోలు వాక్యముల వత్స
పద్మసంభవ నీతపోభారమునకుఁ
బరమ సన్తోష మొందితిఁ బదవినీయఁ
దలఁచితినటంచుఁ బలికె మాధవుఁడు పిదప. ౬౦

గీ. అబ్జజుఁడ; నీకొసంగెద నాధిపత్య
మింక బ్రహ్మాండమునకెల్ల నిచ్చవచ్చి
నట్లుసృజియింపు పుత్రుని నవలజనుల
మఱియు సచరాచరంబు నేర్పరియనంగ. ౬౧

క. నీయందు నాదు తేజము
నోయజ, యుంచెదనుగొంతయొనరుతునీకున్
సాయంబును వేదములు మ
దాయతనిశ్వాసమారుతావళిఁ బుట్టెన్. ౬౨

క. వేదంబుల నొసఁగెదనా
మోదంబునవానిఁగొనుము బుద్ధిప్రతిభన్
వేదోక్తం బెటులటువలెఁ
గాదనక చరింపవయ్య కమలప్రభవా. ౬౩

గీ. దేవదేవ, హరీ, జగద్దివ్యరక్ష
నేనుదలఁదాల్చి భవదాజ్ఞనీవుపల్కు
పలుకుల శిలాక్షరంబుగ సలుపువాఁడ
ననుచు నాబ్రహ్మయట్టుల మనవిచేసె. ౬౪

చ. హరి, భవదాజ్ఞభూమివలయంబుఁ జరింపమదీయబుద్ధియే
యిరవుననైన శుద్ధినినొకింతయుఁ బొందమికిన్ జలించియా

పరమవనంబుఁ జేరఁగనె పావనతన్విలసిల్లఁ జూచినే
నరుసమునొందినాఁడఁ జతురాగమకారక, భక్తతారకా. ౬౫

ఉ. కాంచితి నీస్వరూపమును గన్నులవిందుగ నిందునందుచే
నెంచితిక్షేత్రకారణ తదీయమహత్త్వముల న్వినంగ నే
నంచిత సత్కృపామతిని నాద్యులు తాముపచింతు రేని మ
న్నించి యనుగ్రహింపరె గణింపరెనాదగుకోర్కి మాధవా. ౬౬

వ. అనుచు నలువచూలియనుడు వెన్నుండిట్లనియె. ౬౭

క. శ్రీశారదవారిజ రజ
నీశాంబుజతారహార హిమభూధర సం
కాశాచ్ఛశరీరాక మ
లేశాహయవదన భారతీశాదినుతా ౬౮

క. తనయావిను మీక్షేత్రపు
ఘనతన్వచియింతు దీనిగణ యుగమునం
జొనుపుకొను మనుజులందఱి
కనవరతమునాదుచెంత నావాసమగుఁ ౬౯

సీ. ఘనభూతపంచకమ్ము నొనర్చియీకర్మభువిఁ
బుణ్యతమమైన భూమియందుఁ
గాపురంబుండి నన్ననుగొన్న మాత్రానన్నెల్ల
వారికి ముక్తినిత్తునంచు
సంకల్పమొందు నాకంకురించెను దొల్లియట్టి
పుణ్యక్షేత్రమైననేల
యిదియె లచ్చికినాకు నింపయ్యెఁగాన నీచోటికా
పైతినే నాటఁగోలె.

గీ. అందుచేనిట సచ్చిదానందమయుఁడు
దివ్యతేజోమయుఁడు సర్వదేవమయుఁడు

నగుపరబ్రహ్మ నీచిత్తమందుఁదోఁచె
నింకనీక్షేత్ర భావిమహిమ వచింతు. ౨౦

క. వినుమిది పరమాత్మమయం
బనఘాయటుగానఁ బారమాత్మ్యంబనుచున్
మనగోష్ఠిచేత గోష్ఠీ
వనమనుచున్ రెండుపేళ్లఁ బరఁగుచునుండున్. ౨౧

క. చిరకాలముగానే త
ద్వరపుణ్యక్షేత్రమధ్యభాగమ్మునఁగా
పురముందుందిరముగ ని
వ్వరిముంటినిఁబోలు సూక్ష్మభారూపముతోన్. ౨౨

ఉ. వారిజగర్భ నన్దనన పారగుణోత్తరుఁడత్రిజాహ్నవీ
తీరమునందు నిశ్చలమతిందపము న్పొనరించునింకనా
ధీరుఁడొనర్చునట్టి వినుతిన్వినియాతని కేను నన్నుఁగ
న్నారఁగఁజూపకున్న జగమందువినింద్యుఁడనౌదుఁగావునన్. 23

క. నేమముగా స్వాయంభువ
నామకమన్వంతరంబు నన్గృతయుగ మం
దే మొదటినాఁటి ప్రొద్దున
నే మునికిన్దర్శనంబు నిచ్చెదఁగాశిన్. ౨౪

చ. అదిమొదలార్వురా మనువులంతము నొందినదాఁక యాపురిన్
ముదముననుండి యేడవమనుప్రభుకాలమునందు నిర్వదె
న్మిదవకృతంబునందుఁ బయనించెదనే నొకభక్తుఁడైన భూ
త్రిదశుని సాక్షివాదమొనరింపఁగ నిచ్చటికబ్జసంభవా. ౨౫

గీ. ఆదినంబాదినాకు బ్రహ్మాండనాశ
మాదనుకచెల్లు సాక్షినారాయణాఖ్య
ఘనతనీక్షేత్ర మస్మదాకారమగుట
నాంధ్రదేశంబటంచుఁ బ్రఖ్యాతిఁగాంచు. ౨౬

సీ. మద్వాహువునను జన్మమునొందునీ తుంగభద్ర
నీళాలనులోపల మునింగి
యబ్ధి కేగుచునుండు నది మొదల్కొ సరోవరము
లోపల మున్గువారు ముక్తిఁ
జేరుచుందురు దీనితీరమందు వసించునన్నుఁ
గాంచుచుభక్తి సమ్ముత్తైన
పాపాత్ములును ముక్తభావమొందుదురే తదీయ
స్మృతిస్పర్శ నేక్షణముల.

గీ. సమరులక్షునైన నబ్బనియస్మదీక్ష
ణంబు నీతుంగభద్రఁ దానంబుమఱియు
క్షేత్రసంస్పర్శనంబను నీత్రయంబు
గల్గుపాపులకును ముక్తిగల్గునిజము. ౭౭

క. క్రిమికీటకాది జీవులుఁ
గుమతులుఁ బాతకులు హీనకులజులు నేత
ద్విమలక్షేత్ర పవనగం
ధముసోఁకిన మాత్రముక్త తన్గాంతురిలన్. ౭౮

ఉ. ఇట్టులనన్నుఁగాంచు నరులెల్లరకుందగు ముక్తిబిచ్చుమున్
బెట్టుచు వారువీరనెడు భేదమొకింతయులేక యిచ్చటన్
గట్టిగనుండు నీబ్రతుకుకాలము సెల్లినదాఁకయంతనా
పట్టునకేగి యచ్చట నివాసమొనర్చెద నబ్జసంభవా. ౭౯

చ. అనిహరి కన్నుచాటయిననంతటఁ బంకజసంభవుండు న
మ్మనమతి విస్మయాంబునిధి మగ్నముకాన్ సరసీతటంబునన్
గనెనొక హోమవేదినటఁగా త్రిల సన్మణిపీఠమందుఁబైఁ
బ్రణవసుకర్ణికోల్లసిత బాలదివాకర తుల్యపద్మమున్. ౮౦

గీ. ఆసరోజప్రణవ కర్ణికాన్తరమున
రవిసవర్ణంబుఁ దమసఃపరంబు స్వప్ర

భాప్రకాశంబు మఱియు నీవారశూక
సూక్ష్మరూపంబు బ్రహ్మంబుఁ జూచెనజుఁడు. ౮౧

క. పూజించియతని పదసీ
రేజములకు మ్రొక్కులిడివిరించుఁడు మోద
భ్రాజిష్ణుఁడై పొగడుచునా
తేజము గూర్చుండెఁ గొలనితీరమునందున్. ౮౨

ఉ. ఇందునమూఁడుకోట్లపయి నేబదిలక్షలు తీర్థసంతతుల్
పొందుగ సప్తసాగరములుంజెలువొందుచునుండుదీవిలో
నందిగి తానమాడెడుజనమ్ములు ముక్తినిఁగాంతురింకఁ బి
ల్వందగు నీసరోవరము బ్రహ్మసరోవరమంచు నిద్ధరన్. ౮౩

క. దీనింగాంచిన ముక్తియు
దీనింగయినంట విష్ణుదేవుగృహమిటన్
స్నానంబున సారూప్యము
పానమ్మునఁగల్గునైక్య పదవినరులకున్. ౮౪

క. అనియిట్టులీ సరోవర
మునకీవరముల నొసంగి ముదితాత్ముండై
వననిధితనయేశుని యా
జ్ఞనుగొనిచనె బమ్మతనదు సదనంబునకున్. ౮౫

గీ. దేవదేవవిరూపాక్ష దీనరక్ష
శ్రీరమాధవుఁడట్లు గోష్ఠీవనమున
సాక్షివాదమ్ము నెవరిపక్షమునఁ జలిపె
నేమికతముననో తెల్ప వేమహాత్మ. ౮౬

క. అనవుడు హరుఁడిట్లనుఁ దన
వనితకు "నీసంశయంబు వాపెదవినుము
వనజోదరునాద్య దినం
బున స్వాయంభువునివేళ మొదటికృతమునన్. ౮౭

క. తొలిపాదమ్మునఁ గాశీ
నలువకొమరుఁడైన యత్రినామకముని ని
శ్చలశుద్ధమనస్కుండై
నిలిచెం దపమాచరించు నిష్ఠదలిర్పన్. ౧౮

సీ. మండు వేసవిలోన నుండుఁ బంచాగ్నిమధ్యమునఁ
ప్రావృట్కాలమందు బయల
శిశిరకాలమునందు శీతనీరములోన నుండి
యాహారమ్ము నుజ్జగించి
వాతాశనుండౌచు వసుధపైనొక కాలనిలిచి
నిశ్చలకాష్ఠతులితుఁడౌచు
శంఖచక్రగదాబ్జ శార్ఙ్గభాసురపాణి
యారమేశుని చిత్తమందునిల్పి

గీ. అనిలరోధమ్మొనర్చి యష్టాక్షరాఖ్య
మంత్ర జాపకుఁడౌచు సమాధిలోన
నత్రిముని నిల్చియష్టసహస్ర వత్స
రమ్ములతిఘోరమైన తపమ్మొనర్చె. ౧౯

ఉ. అమ్మునికుంజరుండు తపమట్లొనరించుచు నుండవాని శీ
ర్షమ్మున నుండి భీకరతరమ్మగు ధూమము లేచి సర్వలో
కమ్ములునిండ ఘోరభయకంపితులై సురలు న్మునీంద్రులున్
బమ్మను "నీవుమాకు శరణమ్మవుకమ్ము" ని వేడిరంతటన్. ౨౦

గీ. బ్రహ్మదేవుఁడు తనప్రభావమ్ముచేత
వారిభయకారణ మెఱింగి వనజనాభుఁ
దక్క యన్యులుగాపాడ దక్షులెవరు
గలరటంచును వారలఁగలయఁజూచి. ౨౧

ఉ. ఆవనజాతసంభవుఁడు నాసురమానులతోడఁగూడి గో
ష్ఠీవనవాసియౌ హరినిఁజేరి "పరాత్పర, దీనరక్ష, భ

క్తానవబద్ధదీక్షు, కరుణాంబునిధీ, శరణం" చు భక్తి స
ద్భావముతోడ సన్నుతులభంగురవృత్తినొనర్చి యిట్లనున్. ౯౨

మ. కరుణాబ్ధీమును నీవుచెప్పితివె "యీయాత్మయందుస్వాయంభువా
న్తరమందాకృతితోడ నిల్పెదనుబుత్రా" యంచునాతోడనా
తరుణంబిప్పుడువచ్చె నత్రిముని చిత్తస్థైర్యమొప్పారనీ
కరుణన్గోరి పొనర్చుచుండెఁ దపముగ్రంబాగతిన్గాశిలోన్. ౯౩

ఉ. ఆమహనీయు మస్తకమునం దుదయించిన ధూమసన్తతుల్
వ్యామకథా మమాదిగ సమస్తజగమ్ములఁ జుట్టెనింక నీ
వాముని రాజ చంద్రమున కత్రిమహర్షికిఁ దోచితావకో
ద్దామకృపాసుధన్మునినిఁ దన్పనిచో జగమెల్లమ్రగ్గెడున్. ౯౪

క. కావుననీ భూతలమున
కీ విపుడరుదెంచి తాపసేశ్వరునత్రిన్
గావుమువరము లొసంగుచుఁ
బావనగుణధామ భక్తభయహరనామా. ౯౫

క. వనజాక్షావినుమార్వురు
మనువులు గడతేఱువఱకు మానితముగఁగా
శినినిల్చి మగుడనీవీ
వనమునకేతెంతు సాక్షివాదమొనర్పన్. ౯౬

గీ. తల్లివెంబడినెటుల వత్సమ్ముసాగు
నటులనే భక్తవర్గమ్మునను గమింతు
ననుచుఁ బ్రతినను బట్టితి వందుచేతఁ
దలఁచితివి భక్తసాక్షి వాదమ్మొనర్ప. ౯౭

క. అనుచున్నవ నజోదరుఁడంతి
వినయముగ దురంగనిట్లు విన్నపమొనరిం

చినవిని శ్రీహరిసురలకుఁ
దనరూపముఁ జూపువాంఛతద్దయుఁగల్గన్. ౯౮

క. శ్రీభూతభావనుండ పు
డేభూస్థలికరుగుదెంచి యెంతయుఁ బ్రీతిన్
శోభిల్లుచుఁదోఁచెను దన
స్వాభావికరూపమునను బ్రహ్మాదులకున్. ౯౯

సీ. కోటిసూర్య ప్రభాధాటితోడననన్తమన్మ
థాధికరూపమహిమతోడ
నాతాపితస్వర్ణ పీతాంబరముతోడ దివ్య
భూషణరాజిదీప్తితోడ
గమలావిభాసివక్షఃకవాటముతోడ భాసురమ్మగు
కౌస్తుభమ్ముతోడ
దివ్యచందన లిప్తదేహసంపదతోడ రాజి
తచ్ఛత్రభారమ్ముతోడ.

గీ. జయజయధ్వని పుష్పవర్షములతోడ
బ్రహ్మముఖసర్వసురముని ప్రతతితోడఁ
జెలఁగిదుందుభి నాదములెల్లెఁగుచుండఁ
గదలెహరి కాశికిని విహంగమ్ము నెక్కి. ౧౦౦

ఉ. శ్రీనిలయుండు కాశిఁగయి సేసినమాధి నివిష్టసంతత
ధ్యానని మీలితాత్ముఁడగు నత్రిఁగనుంగొని మ్రోలనిల్వ నా
మౌనియు నాత్మహృజ్జలజమధ్యమునన్మనుగాంచు రూపమున్
గానక విస్మితుండగుచుఁగన్నుగవన్విరియించి ముందరన్ ౧౦౧

సీ. భాస్వత్సహస్రప్రభావి రాజితుఁగోటి కందర్ప
సుందరాకారు నతుల
దివ్యరత్నకిరీట దీప్యమానశిరస్కు మకర
కుండల భాసమానకర్ణు

శ్రీవత్సకౌస్తుభ శ్రీసమంచితవక్షు
వైజయన్తీస్రగ్వి భాసికంఠు
దివ్యపీతాంబరోద్దీపితాధః కాయుమణి
నూపురవిరాజ మానపాదు

గీ. శంఖచక్రగదాబ్జ సంసక్తహస్తు
ననఘుననుపము లక్ష్మీశునాదిదేవు
సచ్చిదానందమయు భక్తసమితివంద్యుఁ
బత్రివాహనుగాంచెనా యత్రివరుని ౧౦౨

క. హరినిఁగనుంగొనుచు నిరం
తరగళదానంద బాష్పనయనుండుమునీ
శ్వరుఁడుపులకాంకితుండై
ధరపైసాష్టాంగనతి విధానమొనర్చెన్ ౧౦౩

క. వ్యక్తావ్యక్తా తీతా
భక్తజనహృదబ్జసక్త పదజలజాతా
నక్తంచరాసు హరణా
సూక్తిప్రతిపాద్యవార్ధి జోర్వీరమణా ౧౦౪

స్రగ్విణి. పంకజాతేక్షణా భక్తసంరక్షణా
శంకరా దిస్తుతాసర్వహృత్సంస్థితా
అంకహీనోడు నాథాతిరమ్యాననా
వేంకటాద్రీశ్వరా విశ్వరక్షాపరా ౧౦౫

గద్య. ఇది శ్రీహయగ్రీవకరుణాపాత్ర కృష్ణాచార్యపౌత్ర వేదవ్యాసాచార్య
పుత్ర న్యాయశాస్త్రప్రవీణ సంగీతకళాపారీణ బాలసరస్వతీబిరుదభ్రాజ
మాన శతావధానాశుకవితా విరాజమాన సకల విద్వద్విధేయ
కాశీకృష్ణనామధేయప్రణీతంబైన గోష్ఠీవనమాహాత్మ్యంబునం
బ్రథమాశ్వాసము సంపూర్ణము. ౧౦౬

## ద్వితీయాశ్వాసము.

---

కం. శ్రీరామాధవ, శతసుమ
నారాచసమాన, సాక్షినారాయణ రూ
పా, రాజితనుగుణా కూ
పారా, హయవదన దుగ్ధవారాశిశయా ౧

గీ. అవధరింపు మన స్తరమద్రిజాత
కేలుఁదమ్ములు మొగిడించి కృత్తివాసు
పదములకుమ్రొక్కి భక్తిసంపత్తిగదుర
నాథునడిగెను వినయవినమ్రయాచు ౨

గీ. అద్రిశయ, శ్రీరమేశుపాదాబ్జములకు
నతులసాష్టాంగ నమనంబు నాచరించి
స్తుతియేమియొనర్చె నాచిత్రకథను
జెప్పుమన శివుఁడంతటఁ జెప్పెనిటుల ౩

కం. ముదితావిను విస్మయస
మ్మదముల మైమఱచి యత్రిమఱిమఱి భగవ
త్పదముల కెఱఁగుచునతిగ
ద్గదవాచారచననిట్లు గణుతించెహరిన్. ౪

దండకము. జయజయ, సరోజాతగర్భేశ శక్రాదిదేవేశ, విశ్వజ్ఞ వి
శ్వేశ్వరా, విశ్వభావా, నిరాకార, విశ్వాకృతే, విశ్వతోలోచ
నా, విశ్వవక్త్రా, విభో, విశ్వరూపా, సహస్రాక్ష, విశ్వాన్తరా
త్మన్, సహస్రోత్తమాంగా, సుసూక్ష్మాణురూపాదణీయ స్స్వ
రూపా, మహానన్తరూపాన్మహీయ స్స్వరూపా, సహస్రాంఘ్రి
హస్తా, సదాచేతనాచేతనాన్తర్గ సద్బింబరూపా, ప్రభో, భక్త
సంత్రాణ శీలా, మహాదివ్య సౌందర్యమూర్తే, జగత్సృష్టి ర

క్షాస్త్ర సందాయకా, భావదేవా, రమానాథ, నీలాతుమానా
థ, యజ్ఞేశ్వరా, యజ్ఞరూపా, మహాయజ్ఞరక్షా, సదాయజ్ఞభ
క్షా, సమస్తాగమామ్నాత నిర్దోషనిస్సంఖ్య కళ్యాణదివ్యగుణా
కార, సత్తత్వరూపా, విముక్తిప్రదా, సర్వభక్తానుసారిన్, మ
హాపాతకధ్వంసకారిన్, మహాయోగిహృత్పంకజాన్తర్విహారిన్,
హరే, పాహి శ్రీభావనారాయణా, సచ్చిదానందమూర్తే నమ
స్తే నమస్తే నమస్తే నమః॥ ౫

శా. ఆరీతిన్వినుతించి యంజలిఁదలన్హత్తించి హర్షోదక
శ్రీరాజన్నయనాబ్జుఁడౌచు మునితూష్ణీంభావముం జెందఁగా
శ్రీరామాపతి కాంచి నూతనతటిద్రేఖాంచ దంభోదగం
భీరధ్వాన మెలర్పనిట్టులనియెన్ స్మేరాననాంభోజుఁడై ౬

క. నీవొనరించిన తపమున
నేవిపులముదంబుఁగంటి నింతటితోవ
త్సా వేడికొనుము వరముల
నీవడిగినవెల్ల నిత్తు నిక్కంబనుచున్. ౭

ఉ. శ్రీపతిపల్కులన్విని ఋషిప్రవరుండను దేవదేవ యీ
రూపున, నీభవత్సమ సురూపుబు ముక్తులుగొల్వలక్ష్మితో
నీవురినిల్చి, నిన్నుఁగననేగెడువారికి ముక్తినిమ్ములో
కోపకృతిక్షమంబగుచు నొప్పెడు నీవరమేను వేడెదన్. ౮

ఉ ఈయవతారరూపము మదీయ మనశ్శుభభావయోగజం
బై యెసరేగుటన్నిను సమస్తజగమ్ములవారు భావనా
రాయణయంచుఁ బిల్చుచు నిరంతరము న్గనులారఁగాంచుచున్
హాయిగ నీపదాంబుజములందుచునుందురు గాత మాధవా. ౯

ఉ॥ ఇంకొకమాటఁజిత్తమున నింపుగఁజొన్పుము భావదేవ యీ
వంకకువచ్చువారలకు భర్గునిలోకమయంచువిందునే

నింకనటుండఁగూడ దెవరేనియు నీపదసేవఁ జేసినన్
శంకవొలంగినీచరణసన్నిధినొందుచు నుండ్రుగావుతన్ ॥ ౧౦

క॥ ఏమనుజులేని నీముఖ
తామరసముఁగాంచి పంచతంజెందెదరో
యామనుజులెల్ల తావక
ధామంబుననుండ్రు శాశ్వతప్రమదముతోన్ ౧౧

చ॥ అనవుడు శ్రీసుఁడిట్టులనుసంతయునట్లగు భావివృత్తము
న్వినుము యుగానుసారముగ నేనిటనిల్చి మునీంద్ర, యార్వురా
మనువులుదీరుదాఁక నిలమానవకోటికి ముక్తినిత్తు నా
వెనుకను గోష్ఠికావనికి వెళ్ళుదుభక్తుని వెంటసాక్షిగాన్ ౧౨

సీ॥ భావనారాయణుండిటు బల్కి స్వర్ణ
దివ్యమాణిక్య లసదకృత్రిమవిమాన
మందునిల్చిన నంతబ్రహ్మాదిదేవ
తానిసత్తము లావిష్ణు మహిమగనుచు ౧౩

క॥ గంగాతీరమునజగ
న్మంగళనవరత్నదివ్య మంటపమునమా
తంగాభయదునిఁ గనులా
రంగాంచుచునంతటన్ని రంతరభక్తిన్ ౧౪

ఉ॥ అమ్మణిమంటపాంతరవిహారిని దివ్యసుమమ్ములన్సుగం
ధమ్ముల ధూపదీప సముదాయములన్రుచిరామృతాతిహా
ద్యమ్మగుపంచభక్ష్య పరమాన్నములందగు షోడశోపచా
రమ్ములఁబూజసల్పి యనురాగమెలర్పఁగ నిండ్లకేగుడున్ ౧౫

మ॥ విమలజ్ఞాన సముద్రుఁడత్రియుఁ దపోవిర్యార్జితప్రోల్లస
త్సుమగంధాద్యఖిలోపచారముల నెంతోప్రీతితోడంద్రివి
క్రమునర్చావిధిఁ గొల్చుచుండ మనుషట్కంబంతముం జెందిన
క్తమమన్వంతర మేగుదెంచె నబలా వైవస్వతాఖ్యాతమై ౧౬

భాప్రకాశంబు మఱియు నీవారశూక
సూక్ష్మరూపంబు బ్రహ్మంబుఁ జూచెనజుఁడు. ౫౧

క. పూజించియతని పదసీ
రేజములకు మ్రొక్కి లిడివిరించుఁడు మోద
భ్రాజితుఁడై పొగడుచునా
తేజము గూర్చుండెఁ గొలనితీరమునందున్. ౫౨

ఉ. ఇందునమూఁడుకోట్లపయినేబదిలక్షలు తీర్థసంతతుల్
పొందుగ సప్తసాగరములుంజెలువొందుచునుండుదీనిలో
నందిగి తానమాడెడుజనమ్ములు ముక్తినిఁగాంతురింకఁ బి
ల్వందగు నీసరోవరము బ్రహ్మసరోవరమంచు నిద్ధరన్. ౫౩

క. దీనింగాంచిన ముక్తియు
దీనింగయినంట విష్ణుదేవుగృహమిటన్
స్నానంబున సారూప్యము
పానమ్మునఁగల్గు నైక్య పదవినరులకున్. ౫౪

క. అనియిట్టులీ సరోవర
మునకీవరముల నొసంగి ముదితాత్ముండై
వననిధితనయేశుని యా
జ్ఞనుగొనిచనె బమ్మతనదు సదనంబునకున్. ౫౫

గీ. దేవదేవవిరూపాక్ష దీనరక్ష
శ్రీరమాధవుఁడట్లు గోష్ఠీవనమున
సాక్షివాదమ్ము నెవరిపక్షమునఁ జలిపె
నేమికతమునన్ తెల్పవేమహాత్మ. ౫౬

క. అనవుడు హరుఁడిట్లనుఁ దన
వనితకు «నీసంశయంబు వాపెదవినుము
వనజోదరునాద్య దినం
బున స్వాయంభువుని వేళ మొదటికృతమునన్. ౫౭

క. తొలిపాదమ్మునఁ గాలిఁ
నలువకొమరుఁడైన యత్రినామకముని ని
శ్చలశుద్ధమనస్కుండై
నిలిచెం దపమాచరించు నిష్ఠదలిర్పన్. ౮౮

సీ. మంచు వేసవిలోననుండుఁ బంచాగ్ని మధ్యమునఁ
బ్రావృట్కాలమందు బయల
శిశిరకాలమునందు శీతనీరములోననుండి
యాహారమ్ము నుజ్జగించి
వాతాశనుండౌచు వసుధపైనొక కాలనిలిచి
నిశ్చలకాష్ఠతు లితుఁడౌచు
శంఖచక్రగదాబ్జ శార్ఙ్గభాసురపాణి
యారమేశుని చిత్తమందునిల్పి

ఆ. అనిలరోధమ్మొనర్చి యష్టాక్షరాఖ్య
మంత్ర జాపకుఁడౌచుసమాధిలోన
నత్రిముని నిల్చియష్టసహస్ర వత్స
రమ్ములతిఘోరమైన తపమ్మొనర్చె. ౮౯

ఉ. అమ్మునికుంజరుండు తపమట్లొనరించుచు నుండవాని శీ
ర్షమ్ముననుండి భీకరతరమ్మగు ధూమము లేచి సర్వలో
కమ్ములునిండ ఘోరభయకంపితులై సురలు న్మునీంద్రులుం
బమ్మను "నీవుమాకు శరణమ్మవుకమ్మ" ని వేడిరంతటన్. ౯౦

ఆ. బ్రహ్మదేవుఁడు తనప్రభావమ్ముచేత
వారిభయకారణ మెఱింగి వనజనాభుఁ
దక్క యన్యులుగాపాడ దక్షులెవరు
గలరటంచును వారలఁగలయఁజూచి. ౯౧

ఉ. ఆవనజాతసంభవుఁడు నాసురమానులతోడఁగూడి గో
ష్ఠీవనవాసియౌ హరినిఁ జేరి "పరాత్పర, దీనరక్ష, భ

క్షాంతసబద్ధదీక్ష, కరుణాంబునిధీ, శరణం" చుభక్తి స
ద్భావముతోడ సన్నుతులభంగురవృత్తినొనర్చి యిట్లనున్. ౨

మ. కరుణాబ్ధీమును నీవుచెప్పితివె "యీయాత్మయందుస్వాయంభువా
న్తరమందాకృతితోడ నిల్చెదనుపుత్రా" యంచునాతోడనా
తరుణంబిప్పుడువచ్చె నత్రిముని చిత్తస్థైర్యమొప్పారనీ
కరుణన్గోరి ఘోనర్చుచుండెఁ దపముగ్రంబాగతిన్గాశిలోన్. ౩

ఉ. ఆమహనీయు మస్తకమునం దుదయించిన ధూమసన్తతుల్
వామకథా మమాదిగ సమస్తజగమ్ములఁ జుట్టెనింక నీ
వాముని రాజ చంద్రమున కత్రిమహర్షికిఁ దోచితావకో
ద్దామకృపాసుధన్మనినిఁ దన్పనిచో జగమెల్లప్రమగ్గెడున్. ౪

క. కావునసీ భూతలమున
కీ విపుడరుదెంచి తాపసేశ్వరునత్రిన్
గావుమువరము లొసంగుచుఁ
బావనగుణధామ భక్తభయహరనామా. ౫

క. వనజాక్షావిను మూర్వ్వరు
మనువులు గడతేఱువఱకు మానితముగఁగా
శినినిల్చి మగుడసీవీ
వనమునకేతెంతు సాక్షివాద మొనర్పన్. ౬

గీ. తల్లివెంబడియెటుల వత్సమ్ముసాగు
నటులనే భక్తవర్గమ్మునను గమింతు
ననుచుఁ బ్రతిననుబట్టితి వందుచేతఁ
దలఁచితివి భక్తసాక్షి వాదమ్మొనర్ప. ౭

క. అనుచున్న జోదరుడంతి
వినయముగదుర్గంగనిట్లు విన్నపమొనరిం

చినవిని శ్రీహరిసురలకుఁ
దనరూపముఁ జూపువాంఛ తద్దయుఁగల్గన్. ౯౮

క. శ్రీభూతభావనుండ వు
డ్డీభూస్థలికరుగుదెంచి యెంతయుఁ బ్రీతిన్
శోభిల్లుచుఁ దోఁచెను దన
స్వాభావికరూపమునను బ్రహ్మాదులకున్. ౯౯

సీ. కోటిసూర్య ప్రభాధాటితోడ ననన్తమన్మ
థాధికరూపమహిమతోడ
నాతాపితస్వర్ణ పీతాంబరముతోడ దివ్య
భూషణరాజిదీప్తితోడ
కమలావిభాసివక్షఃకవాటముతోడ భాసురమ్మగు
కౌస్తుభమ్ముతోడ
దివ్యచందన లిప్తదేహసంపదతోడ రాజి
తచ్ఛత్రభారమ్ముతోడ.

తే. జయజయధ్వని పుష్పవర్షములతోడ
బ్రహ్మముఖసర్వసురముని ప్రతతితోడఁ
జెలఁగిదుందుభి నాదము ల్చెలఁగుచుండఁ
గదలెహరి కాశికిని విహంగమ్ము నెక్కి. ౧౦౦

ఉ. శ్రీనిలయుండు కాశిఁగయి నేసిసమాధి నివిష్టసంతత
ధ్యానని మీలితాక్షుఁడగు నత్రిఁగనుంగొని మ్రోలనిల్వనా
మౌనియునాత్మహృజ్జలజమధ్యమునన్మనుగాంచు రూపమున్
గానక విస్మితుండగుచుఁగన్నుఁ గవన్విరియించి ముందరన్ ౧౦౧

సీ. భాస్వత్సహస్రప్రభావి రాజితుఁగోటి కందర్ప
సుందరాకారు నతుల
దివ్యరత్నకిరీట దీప్యమానశిరస్కు మకర
కుండల భాసమానకర్ణు

శ్రీవత్సకౌస్తుభ శ్రీసమంచితవక్షు
వైజయన్తీస్రగ్వి భాసికంఠు
దివ్యపీతాంబరోద్దీపితాధః కాయుమణి
నూపురవిరాజ మానపాదు

గీ. శంఖచక్రగదాబ్జ సంస క్తహస్తు
ననఘుననుపము లక్ష్మీశునాదిదేవు
సచ్చిదానందమయు భక్తసమితివంద్యుఁ
బక్షివాహనుగాంచెనా యత్రిమౌని ౧౦౨

క. హరినిఁగనుంగొనుచు నిరం
తరగళదానంద బాష్పనయనుండుమునీ
శ్వరుఁడుపులకాంకితుండై
ధరపైసాష్టాంగనతి విధానమొనర్చెన్ ౧౦౩

క. వ్యక్తావ్యక్తా తీతా
భక్తజనహృదబ్జస క్త పదజలజాతా
న క్తంచరాసు హరణా
సూ క్తిప్రతి పాద్యవార్ధి జోర్వీరమణా ౧౦౪

స్రగ్విణి. పంకజాతేక్షణా భక్తసంరక్షణా
శంకరా దిస్తుతాసర్వహృత్సంస్థితా
అంకహీనోడు నాథాతిరమ్యాననా
వేంకటాద్రీశ్వరా విశ్వరక్షాపరా ౧౦౫

గద్య. ఇదిశ్రీహయగ్రీవకరుణాపాత్ర కృష్ణాచార్యపౌత్ర వేదవ్యాసాచార్య పుత్రన్యాయశాస్త్రప్రవీణసంగీతకళాపారీణ బాలసరస్వతీబిరుదభ్రాజ మాన శతావధానాశుకవితా విరాజమాన సకల విద్వద్విధేయ కాశీకృష్ణనామధేయప్రణీతంబైన గోష్ఠీవనమాహాత్మ్యంబునం బ్రథమాశ్వాసము సంపూర్ణము. ౧౦౬

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరామాధవ, శతసుమ
నారాచసమాన, సాక్షినారాయణరూ
పా, రాజితనుగుణాకూ
పారా, హయవదన దుగ్ధవారాశిశయా ౧

తే. అవధరింపు మనన్తరమద్రిజాత
కేలుఁదమ్ములు మొగిడించి కృత్తివాసు
పదములకు మ్రొక్కి భక్తిసంపత్తిగదుర
నాథునడిగెను వినయవినమ్రయౌచు

గీ. అద్రిజయు, శ్రీరమేశుపాదాబ్జములకు
నటుల సాష్టాంగ నమనంబు నాచరించి
శ్రుతియేమియొనర్పె నాచిత్రకథను
జెప్పుమన శివుఁడంతటఁ జెప్పెనిటుల

క. ముదితా విను విస్మయన
మ్మదముల మైమఱచి యత్రిమఱిమఱి భగవ
త్పదముల కెఱఁగుచునతిగ
ద్గదవాచారచననిట్లు గణుతించెహరిన్. ౪

దండకము. జయజయ, సరోజాతగర్భేశ శక్రాదిదేవేశ, విశ్వజ్ఞ వి
శ్వేశ్వరా, విశ్వభావా, నిరాకార, విశ్వాకృతే, విశ్వతోలోచ
నా, విశ్వవక్త్రా, విభో, విశ్వరూపా, సహస్రాక్ష, విశ్వాన్తరా
త్మన్, సహస్రోత్తమాంగా, సుసూక్ష్మాణురూపాదణీయ స్స్వ
రూపా, మహానన్తరూపాన్మహీయస్స్వరూపా, సహస్రాంఘ్రి
హస్తా, సదాచేతనాచేతనాన్తర్గ సద్బింబరూపా, ప్రభో, భక్త
సంత్రాణశీలా, మహాదివ్యసౌందర్యమూర్తే, జగత్సృష్టి ర

క్షాన్త సంధాయకా, భావదేవా, రమానాథ, నీలాక్షమానా
థ, యజ్ఞేశ్వరా, యజ్ఞరూపా, మహాయజ్ఞరక్షా, సదాయజ్ఞభ
క్షా, సమస్తాగమామ్నాత నిర్దోషనిస్సంఖ్య కళ్యాణదివ్యగుణా
కార, సత్తత్వరూపా, విముక్తిప్రదా, సర్వభక్తానుసారిన్, మ
హాపాతకధ్వంసకారిన్, మహాయోగిహృత్పంకజాన్తర్విహారిన్,
హరే, పాహిశ్రీభావనారాయణా, సచ్చిదానందమూర్తే నమ
స్తే నమస్తే నమస్తే నమః॥ ౫

శా. ఆరీతిన్నినుతించి యంజలిఁదలన్ఘటించి హర్షోదక
శ్రీ రాజన్నయనాబ్జుఁడౌచు మునితూష్ణీంభావముంజెందఁగా
శ్రీరామాపతి కాంచి నూతనతటిద్దేఖాంచ దంభోదగం
భీరధ్వాన మెలర్పనిట్టులనియెన్ స్మేరాననాంభోజుఁడై ౬

క. నీవొనరించిన తపమున
నేవిపులముదంబుఁగంటి నింతటితో వ
త్సా వేడికొనుము వరముల
నీవడిగినవెల్ల నిత్తు నిక్కం బనుచున్. ౭

ఉ. శ్రీపతిపల్కులన్విని ఋషిప్రవరుండను దేవదేవ యీ
రూపున, నీభవత్సమ సురూపులు ముక్తులుగొల్వలక్ష్మితో
నీవురినిల్చి, నిన్నుగననేగెడువారికి ముక్తినిమ్ములో
కోపకృతిక్షమంబగుచు నొప్పెడు నీవరమేను వేడెదన్. ౮

ఉ ఈయవతారరూపము మదీయ మనశ్శుభభావయోగజం
బై యొనరేగుటన్నినను సమస్తజగమ్ములవారు భావనా
రాయణయంచుఁ బిల్చుచు నిరంతరము న్ననులారఁగాంచుచున్
హాయిగ నీపదాంబుజములందుచునుందురు గాత మాధవా. ౯

ఉ॥ ఇంకొకమాటఁజిత్తమున నింపుగఁజొన్పుము భావదేవ యీ
థంకకువచ్చువారలకు భర్గునిలోకమయంచువిందునే

నింకనటుండఁగూడ దేవ రేనియు నీపద సేవఁ జేసిన౯
శంకదొలంగి నీచరణసన్నిధి నొందుచు నుంద్రుగా వృత౯ ॥ ౧౦

క॥ ఏమనుజు లేని నీముఖ
తామరసముఁ గాంచి పంచతం జెందెదరో
యామనుజు లెల్ల తావక
ధామంబున నుంద్రు శాశ్వత ప్రమదముతో౯ ౧౧

చ॥ అనవుడు శ్రీశుఁ డిట్టులనునంతయునట్ల సుభావివృత్తము
న్వినుము యుగానుసారముగ నేనిటనిల్చి మునీంద్ర, యార్యరా
మనుపులు దీరు దాఁక నిలమానవకోటికి ముక్తి నిత్తు నా
వెనుకను గోష్ఠి కావనికి వెళ్ళుదు భక్తుని వెంటసాక్షిగా౯ ౧౨

సీ॥ భావనారాయణుండిటు బల్కి స్వర్ణ
దివ్యమాణిక్య లసదకృత్రిమవిమాన
మందు నిల్చిన నంత బ్రహ్మాది దేవ
మానిసత్తము లావిష్ణు మహిమ గనుచు ౧౩

క॥ గంగాతీరమునజగ
న్మంగళనవరత్నదివ్య మంటపమునమా
తంగాభయదుని గనులా
రం గాంచుచు నంతటన్ని రంతరభక్తి౯ ౧౪

ఉ॥ అమ్మణిమంటపాంతరవిహారిని దివ్యసుమమ్ములన్సుగం
ధమ్ముల ధూపదీప సముదాయముల న్రుచిరామృతాతిహృ
ద్యమ్మగు పంచభక్ష్య పరమాన్నములందగు షోడశోపచా
రమ్ములఁ బూజసల్పి యనురాగ మెలర్పఁగ నిండ్లకేగుదు౯ ౧౫

మ॥ విమలజ్ఞాన సముద్రుఁడత్రియుఁ దపోవీర్యార్జిత ప్రోల్లస
త్సుమగంధాద్యఖిలోపచారముల నెంతో ప్రీతితో డంద్రివి
క్రమునర్చావిధిఁ గొల్చుచుండ మనుషట్కంబంత ముం జెందిన
ప్తమమన్వంతర మేగుదెంచె నబలా వైవస్వతాఖ్యాతమై ౧౬

క॥ ఆవైవస్వతమునన
ష్టావింశకృతంబునన్బ్రశస్తాంధ్రోర్వీన్
దేవీ, స్వర్ణపురముశో
భావహమై వెలయుచుండె నాపురిలోనన్ ౧౭

చ॥ ఘనుఁడొకఁడబ్జగర్భకులకంధిసుధాకిరణుండు కేశవుం
డనుబుధపుంగవుండు గలఁడాతనికొక్కఁడు మేనయల్లుఁడుం
డెనుసుగుణాకరుండధిక నిర్మలచిత్తుఁడు శాన్తిదాన్తిభూ
షణుఁడతిధార్మికుండఖిల శాస్త్రవిచక్షణుఁడాత్మవేత్తయున్ ౧౮

క॥ గోవిందుఁడందురాతని
నీవసుధావలయమందు నెంత వెదకినన్
నేవిని కనియు నెఱుఁగనా
గోవింమునివంటి పెద్ద గూనుగలానిన్ ౧౯

ఉ॥ స్వాంతమునందు శ్రీహరి పదాబ్జములన్నెలకొల్పినిండుని
శ్చింతతఁదీర్థయాత్రలను జేయుతలంపునఁ గేశవుండుఁగొం
డంతకురూపియానతని యల్లుఁడు నిర్వురునొక్కనాఁటిరా
త్ర్యంతమునందు మేల్కొని ప్రయాణమొనర్చిరి యుత్తరాశకున్

ఉ॥ ఆవలఁదుంగభద్ర జలమందు మునుంగుచు విప్రులంతగో
ష్ఠీవనినాత్త వేదిక విశేషసుమాంజలు లిచ్చికృష్ణలో
శ్రీవిగ్రహుంకి బుక్కులఁ బఱించి తపోజపములొనర్చి గో
దావరిఁ దానమాడియటఁ దప్పని చెయ్వులొనర్చియంతటన్ ౨౧

ఉ॥ నర్మదలోనమజ్జన మొనర్చి క్రమంబుగఁ గాశికేగుడున్
నిర్మలశంబరస్ఫుటిత నీజచుంచి సమీరయాచుదు
సత్కర్మములందొలంచఁగల జాహ్నవిఁగన్గొని ప్రమొక్కిభూసురు
ల్ధర్మపరోత్తమస్తవము లన్నినుతించుచు నమ్మహానదిన్ ౨౨

సీ॥ దేవి, తానమాడి దేవర్షిపితృగణ
తర్పణంబు జపము తపము సల్పి

హృన్మానసుపర్వులధిక సంతోషమునసరి
త్తీరమందుఁ గన్నులారఁగనిరి ౨౩

క॥ రత్నమయగోపురమునవ
రత్నప్రాకారభాసు రమ్యతిదీవ్య
ద్రత్న ద్వారంబగునొక
నూత్న విమానమ్ముఁ గడువినోదముతోడన్ ౨౪

మ॥ నవ్యోద్యానపరీవృతం బయిసదానందాభిదంబై మరు
త్సేవ్యంబైన విమానమున్మిగుల భక్తిన్మ్రొక్కి తత్సన్నిధిన్
సవ్యంబౌగతిఁ జేరియేడయిన కక్ష్యల్దాటియాలోపలన్
దీవ్యన్మంటపమొందువిస్మయము సంధిల్లంగ నీక్షించుచున్ ౨౫

క॥ ఆమంటపంబునన్వీను
మామణిమయపీఠిదాని మధ్యమునందున్
హేమమయతామరసమా
తామరసమునందునీశు దర్శించిరటన్ ౨౬

చ॥ ఉరమునలచ్చికౌస్తుభము నొప్పులగుప్పఁగ వైజయంతికం
ధరమున వ్రేలనంగముల నవ్యవిభూషణ ముల్దగంజతు
ష్కరములనుత్తమాయుధనికాయముబూనిన యిందిరామనో
హరుగరుడాదిసేవిత పదాంబుజుఁగన్గొని మ్రొక్కిరిర్వురున్ ౨౭

ఉ॥ అంజలిగట్టిసన్నుతి సుమాంజలు లాయనకప్పగించివా
రంజకయోగిరంతట శివాలయమాశితి కంటఁగాంచి శ్రీ
వింజనిబిందుమాధవుని వేగని కేశవ మందిరమ్ములోన్
అంజిడికాశినీవలన నయ్యెఁజుమాయని మ్రొక్కి రాతనిన్ ౨౮

గీ॥ అంతనిర్వురు భావనారాయణాంతి
కమునకేతెంచి మగుడనాకంజనయను
పాదపంకజములనతిభక్తితోడఁ
గొల్చుచుండిరి యొకనెలఁ గొమరుమీఱ ౨౯

క॥ ఈవిధినారాయణపద
సేవాపరతంత్రవృత్తి శేశయులగుటన్
బావనతమించి వెలిఁగెడు
నావిప్రులలోనమామ, యాత్మగతముగాన్ ౩౦

ఉ॥ పుత్రులు లేనివారలకుఁ బున్నెపుతావులు గల్గఁబోవుగా
పుత్రికయైననిప్పటికిఁ బుట్టగలేదిఁక నాకుఁజూడఁబా
రత్రికసౌఖ్యమెట్లు గదురంగలదంచును మామచింతకున్
బాత్రుఁడుగాఁగనల్లుఁడొక పల్కునుబల్కెను సుమ్ము పార్వతీ ౩౧

శా॥ మామానీకొకకూతురుప్పతిల నన్మర్యాదతో నాకునీ
వామీఁకన్నియనిచ్చి పెండిలినిఁ జేయంబూనుకొంచేనినీ
స్వామిన్నేప్రబతిమాలుకొందును దనూజన్నీకునిమ్మంచునీ
వామాటన్ స్థిరపర్చుమిప్డు హరియే సాక్షిత్వముం జెందఁగా ౩౨

క॥ అనుచుంబల్కినయల్లునిఁ
గనియచ్చెరువందిమామ గారిటులనియెన్
వినుమీయత్తయె తనయ
న్గనినన్నీకిచ్చి పెండ్లిఁ గావింతునొగిన్ ౩౩

శా॥ గోవిందా యెటొతప్పియొక్క తనయాంకూరమ్ము మాకద్భువన్
గోవిందుండుదయింపఁజేసిననదే కొండంత సామ్రాజ్యమౌన్
నీవాక్యంబున నట్లుకావలయుగా నిశ్శంకనైనని
న్నావయ్యాయనిపిల్చిపిల్లనిడి కన్యాదానముంజేయమే ౩౪

ఉ. మందహాసన్ముఖాంబుజుఁడు మాతులుఁడిట్టులఁబల్కగూని గో
విందుఁడు లేచి దేవ, యిదివింటికదా యిఁకసాక్షివీవమా
సందుననంచుఁబల్కి యొకచక్కనికన్నియ మామకీవు గో
విందయనుగ్రహింపఁగదవేయనుచున్ హరిమ్రొక్కెమ్రొక్కినన్.

ఉ. శ్రీహరిగూని బత్తుఁడొనరించిన విన్నపమాలకించి తా
నూహనుబూనెఁ గేశవునకొక్క తెఁగూతునొసంగనాత్మలో

వాహరిభక్తులంతఁ బరమాత్మసమర్చనసష్టసర్వ సం
దేహమనస్కులౌచుఁ బయనించిరి కొన్నిదినాలకింటికిన్. ౩౬

శా. ఆవిప్రోత్తములద్ద్యమందుఁగల పుణ్యక్షేత్రముల్గాంచుచున్
స్వావాసమ్మగు స్వర్ణపత్తనమునందావిష్టులై బంధుగుల్
శ్రీవిం బూజలొనర్పఁగ్రైకొనుచు బల్క్షేమంబు సంధిల్లఁగా
దైవానుగ్రహపాత్రులైమనిరి చిత్తస్వాస్థ్యమొప్పారఁగాన్. ౩౭

ఉ. అంతటఁ గొంతకాలమున కాతనితొయ్యలి చూలుగోలమై
కాంతుని చిత్తమెంతయు వికాసమునొందఁగఁదొమ్మిదౌ నెలల్
సాంతిముగాఁగ నొక్కసమయాన సులగ్నసుపుష్కరంబునన్
సంతసమొప్పఁగాంచెఁ గడుఁజక్కనిచుక్కనునొక్కకన్నియన్.

ఉ. చెందొవవిందు రేకవలెఁ జిన్నదినాఁటికినాఁడు బెంపునుం
జెందఁగఁదండ్రిదానిగుణశీలముల న్మఱిదానియందమున్
డెందమునందలంచి ధరణీతలమందిఁక దీని నేరికీ
యందగునోవివాహసమయమ్మురుదెంచెనటంచు వెండియున్. ౩౯

ఉ. అప్పుడకాశిలోఁగొమిరెనల్లునకిచ్చితి దైవసాక్షిగా
నిప్పుడు పాఁడితప్పి సుతనెట్టుల నన్యునకిత్తుఁ "గన్నెతా
నెప్పుడునందగాని వరియించునుగానఁగురూపికిచ్చినన్
దప్పు"ని వేదశాస్త్రములు దారముగా మొరవెట్టుచుండెడున్.

క. సత్తుఁదొలంగుట యఘమో
బొత్తిగశాస్త్రమ్ముఁదాటి పుచ్చుటయఘమో
యొత్తిలియాలోచించెదఁ
జిత్తముననింకఁ గొంతసేపటిదనుకన్. ౪౧

ఉ. రూపసియైనకన్నెను గురూపికినిచ్చినదాని మానసం
బాపతిపైఁ దగుల్కొనదసంతరమందతి దుష్టతొకమే
దాపురమాను సంకరము దానఘటించుఁగులాన, దానిచే
నాపితృవర్గముల్నరకమందుఁదురంచను వేదవాక్యముల్. ౪౨

క. స్వామీ శాస్త్రముఁదప్పిన
నామాలముఁజెడును సత్యమావలనిడఁగా
నామానిసియొక్కరుఁడే
నేమముగానరకమందు నిల్చునుగాదే. ४३

క. ఈమాదిరిఁ దలఁచుచుఁగ
న్యామాణిక్యమున కన్యనాథుని వెదకన్
జామాత దెలిసికొని యో
మామా వినుమంచు నొక్కమాట వచించెన్. ४४

క. ఏమీ చిత్రము తగునే
మామా నీవంటి పెద్దమానుసులయిటుల్
దామాడినట్టిమాటల
నేమముగా నిల్వకున్న నిల్చునె జగముల్. ४५

గీ. దేవదేవుని మ్రోల నాదినమునంద
కాశికాపురిలోన నీకన్నెమాని
కమ్ము నాకిత్తునంచు వాగ్దానమొసఁగి
నాఁడ వీదినమది దప్పనాయ మొక్కొ. ४६

క. సత్యంబే దైవంబా
సత్యంబునఁ గల్గుచుండు సర్వము, సిరియున్
సత్యంబునందనిల్చును
సత్యంబే పరమపద మసత్యంబఘమౌన్. ४७

ఉ. సత్యమునంద వేదములు సత్యమునందతపస్సమాధులున్
సత్యమునందయాగములు సత్యమునంద సమస్తలోకముల్
సత్యముబల్కువారఖిల సంపదలొందుచునుంద్రు నిచ్చలున్
సత్యముదప్పువారల విసర్జనము న్బొనరింతురందఱున్. ४८

క. రూపవతియా కుమారిఁ గు
రూపికినీఁగూడదనెడు శ్రుతివాక్యమునం

జూపట్టదంత ప్రబలత
యాపలుకువిశేషయుక్తి కాఁగకయుంటన్. ౪౯

చ. మదనునిఁబోలుచక్కని కుమారునికిచ్చిన యేనిలం జెయరా
మదవతివానిఁబాసి యొకమర్కటరూపునిఁగూడియాడు నా
సుదతిసుశీలయే న్దనకుసూకరమూర్తియుఁబెన్మిటైన నా
హృదయవిభుండె దైవమనియెంచును దీనికిశాస్త్రమేటికిన్. ౫౦

క. హరియే నావయిపున సా
కిరిగలఁడిఁకనీవు తల్లక్రిందైననున్
దెరలించి కన్న నింకొ
క్కరునికినీయంగ నలవిగాదో మామా! ౫౧

క. అని యల్లుఁడాడ, మామయు
విని విస్మయమంది కపటవృత్తి నిటులనెన్
వినుమీ హరిమనపత్తన
మున సాక్ష్యముబల్కెనేనిఁ బుత్రికనిత్తున్. ౫౨

గీ అంతగోవిందుఁడామామ యాడినట్టి
పల్కులనువిని తనబంధువర్గములను
బిన్నపెద్దలనందఱఁ బేరఁబేర
బిలిచి పంచాయతినిఁ జేసిపలికె నిట్లు. ౫౩

ఉ వింటిరె బంధుగుల్బెలులు పిన్నలుపెద్దలు మీరలందఱే
నొంటిగఁగాశికేగి సదయున్భగవంతునిఁదెచ్చికొందు నా
వెంటనె యంతదన్క దనపిల్లనునన్యున కీయకుండ మీ
కంటనుగాచుచుండుఁ డటుగాదని నన్బహివెట్టుఁడాతనిన్. ౫౪

క. ఇటులని గోవిందాఖ్యుఁడు
చిటుకుననిల్వెడలి కాశిఁ జేరుచు గంగన్
బుటుకున నాడి జపములం
బటువుగఁగావించి యత్రిమానిం గనియెన్. ౫౫

క. తనరాకకుఁ గారణమా
తనికిన్విశదీకరింపఁ దాపసవరుఁడా
యనపల్కు పల్కులన్నియు
వినియచ్చెరువంది మిగుల వెలవెలబోయెన్. ౫౬

ఉ. ఎక్కడిశిగూని బాపఁడితఁ డెక్కడ శ్రీహరిలోకరక్షకుం
డెక్కడ సాక్షివాదమది యెక్కడ నంచన రాదు శ్రీవిభుం
డక్కటికంపునీటిగనియాటను భర్తుఁడు వెంటరమ్మనన్
గ్రక్కుననేగుఁదల్లి వెనుకన్బడిచాగెడు దూడపోల్పునన్. ౫౭

గీ. ఇంతపర్యంతమే భగవంతుసేవఁ
జేసికొనుచెంతొ సంతుష్టిఁజెందినాఁడ
నిపుడు హరిసేవలేక నేనెట్లునిల్తు
నీశువిడిచినప్రతిప్పు లేనియానో. ౫౮

క. చెప్పెను భగవంతుఁడు నా
కప్పుడ గోష్ఠీవనప్రయాణపుఁ గతలన్
దప్పక దానికిసమయం
బిప్పుడయే తెంచెనింక నేనేమందున్. ౫౯

గీ. సత్యసంకల్పవచన సుసత్యమాన
స్వామినెడఁబాయకుంటకీధాత్రీతలమున
నారిదయనుదక్కి పెఱయుపాయంబుగలదె
యంచు మదిలోఁదలంచుచు నత్రిమౌని. ౬౦

క. మోదముతో గోవిందుని
సాదరతబహూకరించియాదల భగవ
త్పాదముల కెఱఁగిమదిలో
ఖేదముగ కురంగవిధుముఖి యిటులనియెన్. ౬౧

గీ. ఆంధ్రదేశస్థుఁడైన ధరామరుండు
దేవనిన్నాస్త్యమునకుఁ గొంపోవవచ్చె

భక్తపరతంత్రతనీవు నీభక్తవర్యు
వెంటఁజనుదేని నాబ్రతుకుంటసున్న. ౬౨

గీ. అత్రిపల్కులు భగవంతుఁడాలకించి
కరుణలొల్కెడు చూడ్కుల గారవించి
భక్తవరనిన్ను నేఁబాయభయముపీడు
మంచు దువ్వుచు నాతనికనియె నిట్లు. ౬౩

ఉ. ఇక్కడనుండునంచు మదినెంచినకాలము సెల్లిపోయె నీ
చక్కననంత జీవులకొసంగితి ముక్తినివింధ్యపంక్తికిం
దక్కినమంద నేకులకు దర్శనమీవలెఁగాన నింక నేఁ
జక్కఁగగోష్ఠికావనికిఁ జాగెదసాక్షిగ బాపనయ్యతోన్. ౬౪

ఉ. అచ్చుటనన్నుగాంచెడు మహాత్ములకెల్లను ముక్తిబిచ్చమే
నిచ్చుచుఁదమ్మిచూలి విలయించినపిమ్మట నాదులోకముల్
జొచ్చెద, నన్ను నమ్మికొనుచున్ ద్విజుఁడీతఁడువచ్చెఁగాననీ
సచ్చరితుంద్యజించిన యశంబెటుగల్గునునాకుఁ దాపసా. ౬౫

క. సుగుణమ్మున యశమబ్బును
సుగుణమ్మునఁ బ్రభుతయబ్బు సుమ్ము సుగుణులన్
సుగుణమ్ము లాశ్రయించును
సుగుణములేకున్న వారిఁ జూడ రెవరిలన్. ౬౬

క. నిన్నున్వీడను నే వి
ద్వన్నుతుఁడైనట్టి గూనివాని న్వీడన్
వన్నుతచరితానాతో
డ న్నీవునురమ్ము కడుబెడంగు చెలంగన్. ౬౭

మ. మనయుద్యానమునందుఁబుట్టి నయనామక్ష్మాజముల్ శూలియున్
మనవెంటంబడిరాఁగ నీవును సదానందాగ్రభాగంబునన్
వినయంబొప్పఁగ నేగుచుండ మనగోవిందప్ప నీకంటెఁ దా
మొనగాఁడై తగ దారిసూపుచుఁ జన న్మోదంబుగా నేగుదున్.

క. అనియూరడించి పుచ్చిన
మునివల్లియటంచుఁ బల్కి ముదితుండయ్యెన్
ఘనుఁడగు గోవిందప్పయుఁ
జనియె న్నవరత్నపీఠ సన్నిధికంతన్. ౬౯

గీ. శంఖచక్రాదికలిత హస్తములవాని
జలధిజాశ్రిత విపులవక్షంబువాని
భావనారాయణునిఁగాంచి భక్తవరుఁడు
వందనంబిడి యిటు సంస్తవంబొనర్చె. ౭౦

సీ. సర్వలోకాధీశ సర్వాత్మసాక్షి
నారాయణాభిఖ్య జోహారునీకు
జన్మించెనీవక్త్ర సారసంబునవిప్ర
జాతి బాహువులందు క్షత్రజాతి
యూరులందువణిక్కు లుద్భవించిరి పాద
పంకజమ్మునశూద్రు లంకురించి
రాదిత్యుఁడుదయించె నంబకమ్మునని శా
భర్త గన్గెనుమనః పద్మమందు

గీ. అగ్నిసంక్రందనులుపుట్టి రాస్యమందు
నభము బొడ్డున, గాలి ప్రాణమ్ములందుఁ
దలను స్వర్గము పాదాన ధరణి, చెవుల
దిక్కులుదయించెనో విరాడ్దేవదేవ. ౭౧

క. కలిగెఁ జరాచరలోక
మ్ములు నీతనువునను నీవ మోక్షదుఁడవు భ
క్తులకుఁ దమసఃపరుండవు
జలజాక్షా నిన్నుఁ బోలు సాములుగలరే. ౭౨

చ. అని కొనియాడు భక్తుని ముఖాంబుజమున్గని భావదేవుఁడో
యనఘ మదీయమహా తనువునైన నొసంగుదు వేడికొమ్ము నీ

మనమునఁగల్గినట్లు నియమంబడ దయామృత ధారలొల్కఁ నా
డిన విని నేలవేలుపు గడింది ముదంబొదవంగ నిట్లనున్. ౨౩

క. బంధువులందఱిముందఱ
నిందెత్తునటంచుఁ బ్రతిన నేఁబట్టితి గో
విందా రమ్మిఁకమాపుర
మందు న్నీ సాక్ష్యమునకు నవసరమయ్యెన్. ౨౪

క. ఇవ్విధిఁబల్కిన విప్రుని
నెవ్వగఁదొలఁగంగ హరియనె న్నీతోఁ బెన్
దవ్వులనైనం జూడక
చివ్వన నేతెంతు భక్తశేఖర చనుమా. ౨౫

ఉ. ముందుగ నీవు నీవెనుక మోదమెలర్పఁగ నేను నా సదా
నంద విమాన మత్రియు ననామకవృక్షము లీశ్వరుండు మే
మందఱ మేగుదెంతుము ప్రయాణపథమ్మున నీవు వెన్కఁ జూ
డందగ దట్లుచూచినఁ దటాలున నచ్చట నేనునిల్చెదన్. ౨౬

ఉ. అండవినాశమావఱకు నాస్థలమంద వసించి నాకు మున్
దండము వెట్టి మచ్చరణదర్శనమున్ బొనరించునట్టి యు
ద్దండపు భక్తులందఱికిఁ దప్పక యిత్తును ముక్తినంచు నా
యండజవాహనుండనుచు నా ద్విజు వెంటఁ బ్రయాణమైననెన్.

క. అత్రముతోఁ దనవెంబడి
నత్రియుభర్గుండనామ కానోకహముల్
చిత్రపువిమానమును రాఁ
బత్రీశ్వరునెక్కి శార్ఙ్గి పయనించెనటీ. ౨౭

ఉ. సారసగర్భముఖ్య సురసత్తములు న్సురలోకగాయకుల్
నారదముఖ్య దేవఋషినాథులు నా పరమాత్మపై సుమా
సారమొనంగఁగా విబుధసారసలోచన లాడుచుండఁగా
సారిణిమీటి తుంబురులు చక్కఁగఁబాడఁగ నేగిరందఱున్. ౨౮

వ. అప్పుడు కోటిమన్మథసుందరుండును, కోటిభాస్వత్ప్రభావిభాసమానుండును, కుసుమసుకుమారావయవుండును, మందస్మితసుందరవదనారవిందుండును, రక్తారవిందతులితపాదతలుండును, మయూరకంఠోపమజంఘాయుగళుండును, రంభాస్తంభాధికోరుద్వయుండును, కరిశిరఃస్పర్ధినితంబసంశోభితుండును, బ్రహ్మాండద్రవ్యనిక్షేపగేహాయమానోదరుండును, లక్ష్మీవిహారణాస్థానపీఠీభవత్పీనవక్షోవిరాజితుండును, వేదండశుండాయితబాహుదండుండును, వృత్తాగ్రభుజపీవరాంసుండును, కంబుసుందరకంధరుండును, రాకానిశాకరతిరస్కారిముఖమండలభాసురుండును, బింబవిద్రుమసంకాశరదనచ్ఛదవిరాజితుండును, ముక్తామణిసచ్ఛాయదంతపంక్తివిభాసితుండును, తిలకుసుమసమోన్నతనాసికుండును, వికసితసితాంభోజదళవిశాలలోచనుండును, స్మరచాపోపమభ్రూయుగళాంచితుండును, అష్టమీకువలయేశఫాలుండును, శ్రీకారవిలసత్కర్ణకుండలోజ్జ్వలగండమండితుండును, మేరుశృంగసదృశకిరీటవిరాజమానశీర్షుండును, శంఖచక్రగదాపద్మవిభూషితచతుర్భుజుండును, హారకేయూరకటకాంగుళీయాద్యాభరణాలంకృతుండును, శ్రీవత్సకౌస్తుభవనమాలాంచితవక్షుండును, దివ్యపీతాంబరోపరినటత్కాంచీగుణశోభితుండును, ఛత్రచామరోపేతుండును, దేవదేవుండు నగు నప్పరమాత్మను బంకజసంభవుం డిట్లు వినుతింపందొడంగె. ౬౦

బ్రహ్మకృత దశావతార స్తుతి.

క. వందనము వారిజాక్షా
వందనము రమేశయీశ, వాసవపక్షా
వందనము భక్తరక్షా
వందనము బ్రహ్మాండసృష్ట్యవనహృతిదక్షా. ౬౧

సీ. పురుషపరానంద పూర్ణషడ్గుణవిగ్ర
హాసాక్షి దేవజోహారుసేకు

స ద్రూపసృష్టి రక్షాలయప్రదపరా
త్పరపరబ్రహ్మ వందనమునీకు
రూపహీన యనంతరూప శ్రీవైకుంఠ
నాథ లక్ష్మీశ దండంబునీకు
భావగమ్యస్వరూపా మహాయోగిసం
భావ్యరూపా ప్రణామంబునీకు
గీ. భవ్యసంకల్పితస్వరూపా సమస్త
శ్రుతిశిరోరూప చిద్రూప మ్రొక్కునీకు
సత్యసంకల్ప సత్యాప్త సర్వహృదయ
పద్మమందిర యణురూప ప్రణతినీకు. ౧-౨

చ. వననిధిజాత, నిచ్చలు భవత్పదపంకజయుగ్మ మాత్మహృ
ద్వనజమునందునిల్పికొని ధ్యానమొనర్చుచునుండియు న్భవ
ద్గుణ లవవర్ణనంబు మదిఁగోరుచు పారముఁగాంచలేదు నే
నన నిఁక నెంతవాఁడఁ గరుణాకర, శ్రీకరలోకరక్షకా. ౧-౩

మ. తొలిఁ బ్రాబల్యుల దొంగిలించిసఖలున్ దున్నాడి యోదేవ పు
ష్కలమా నీదయ నక్షురాస్యునిఁగన న్గావించి నాకెల్ల వే
ల్పులలోఁ బెద్దరికంబుదెచ్చిన మహాత్ము న్నిన్ను సేవింతు నో
ప్రళయాంభోధివిహార, మీనవరరూపా సాక్షినారాయణా. ౧-౪

శా. నాఁ డంభోనిధిఁ ద్రచ్చుకాలమున మంథానాచలంబాపఁగాఁ
బోడల్గాక సురాసురుల్గలిసి ని న్బొల్పార సాహాయ్యర్థమై
వేడన్ వల్లెయటంచుఁ గవ్వపుమలన్ బృష్ఠంబునన్దోయు వే
క్రీడాకూర్మమునీకు మ్రొక్కెడద శౌరీ సాక్షినారాయణా. ౧-౫

శా. నాఁడీక్షోణితలంబునంతయు హిరణ్యాక్షుండు చాపన్ బలెన్
దోడంగై కొను చేగవాని ననిలోఁ దూఁటాడి భూదేవిఁగా
పాడంజాలిన ప్రోడనీకు నతుల న్బల్మారుగావింతునో
క్రీడాక్రోడశరీరభాసుర మురారీ సాక్షినారాయణా. ౧-౬

శా. ఆలీలం దనయుం హిరణ్యకశిపుం డంభోధిలోఁ ద్రోయుచుం
శూలం గ్రుమ్ముచు నెండనిల్పుచును మీఁద న్నానితీక్ష్ణాగ్నులం
గాలం ద్రోసెడు వేళ నానిసువునుం గాపాడి యా రక్కసిం
హేళిం జంపిన నిన్ను మ్రొక్కెద నృసింహా సాక్షినారాయణా.

మ. బలవైరి స్థలపైన మొత్తి నిఖిలస్వారాజ్యముం గెల్చి ని
స్తులుఁడై రాజ్యము నేలుచున్న బలి నెంతో యుక్తితో "నాకు నీ
యిల మూడడ్గులు చాలు" నంచడిగి వాఁడీయంగఁ గైకొంచు నా
బలి నిం ద్రొక్కిన దంభవామన సురూపా సాక్షినారాయణా.

మ. మునిమూఁపున్నయి సేయు నీ పరశుచే ముయ్యేడుమారు ల్భవ
జ్జనక ద్విణ్ప్రబంధుకంఠ కదళీషండంబులం ద్రెంపి వె
చ్చని యా నెత్తుట నీ పితాళ్యగములం సంతృప్తులం జేయు ని
న్మనమందు న్వినుతింతు నో పరశురామా సాక్షి నారాయణా.

మ. జనకు న్సత్యవచస్కుఁ జేయ విపినస్థానంబుఁ గైసేసి వా
లిని యుద్ధంబునఁ జంపి సూర్యసుతు నోలిం బ్రోచి నీయంగనా
మణిఁ గొంపోయిన రావణుం దునిమి భామం గూడి తోడ్తో నయో
ధ్యను బాలించిన నీకు వందనము రామా సాక్షినారాయణా.

మ. హలమంసంబున నాడఁ దాళము ధ్వజంబై యొప్ప నా రేవతీ
లలనారత్నము జాయయై తగ మహాహ్లాదంబుతోఁ జంద్రబిం
బలస న్మద్యము ద్రావి యాడుచుఁ బ్రలంబధ్వంసివై నట్టి యో
బలరామా యిదె నిన్ను మ్రొక్కెదను దేవా సాక్షినారాయణా.

మ. మధురం జన్మమునొంది గోకులమునం బాలత్వముం బుచ్చి యా
మధుర న్వెండియుఁ జొచ్చి కంసహతకు న్మర్దించి గోగోపులం
మధురంబౌ మురళీనినాదమున సన్మానించి సంతోషవా
రిధి నాడించిన కృష్ణ మ్రొక్కెడెద శౌరీ సాక్షినారాయణా.

మ. వసుధ న్భూతదయాపరత్వమునకుం బ్రాశస్త్య మిప్పింప, స
ర్వసమత్వంబె ప్రధానధర్మమనుచుం బాటింప, మోహాబ్ధిలో

నసురవ్రాతము ముంపఁ, జన్మయుత మాయాదేవి గర్భంబునన్
ప్రసవంబొందిన బుద్ధ వందనము దేవా సాక్షినారాయణా. ౯౩

మ. కలియంతంబునుబొందుకాలమున నీ క్ష్మామండలంబెల్ల మ్లే
చ్ఛులపాలై నిఖలప్రజాతతి మహాక్షోభంబునుం జెంద నా
ఖలులం జంపఁగ ఖడ్గివై ఘనతురంగం బెక్కి యుద్ధాన బల్
పెళపెళ్ళాడుచుఁదోఁచు నీకు నతి కల్కీ సాక్షినారాయణా. ౯౪

మ. పరమప్రేమదలిర్ప నత్రిముని హృద్భావప్రబుద్ధుండవై
ధర నీరూపునఁదోఁచితట్లగుట నో ధర్మస్వరూపా పరా
త్పర, దేవా, నినుభావదేవయనుచున్ బల్కారు నేమ్రొక్కెదన్
కరుణాత్మా, యిఁకనన్ను గావఁగదె వేగన్సాక్షినారాయణా. ౯౫

మ. గోవిందాఖ్యునిసాక్షివై సనుట నీకున్సాక్షినారాయణా
ఖ్యావిస్ఫూర్తిన్ ఘటించెఁగాన నిఁక ని న్నానామధేయంబుచే
భావంబందుఁదలంచి పాడికొను చాపద్బాంధవా నిచ్చలున్
సేవింతు న్భవదీయపాదయుగళిన్ శ్రీ సాక్షినారాయణా. ౯౬

శా. ఓ మత్స్యాది దశావతారవిహృతీ, యోభావనారాయణా
యోమాయారచితాబ్జజాండనివహా, యోభక్తకల్పద్రుమా
యోమానీశ్వర చిత్తపద్మనిలయా, యోసర్వలోకేశ్వరా
యోమోక్షాదిపుమర్థదా శరణు నీకో సాక్షినారాయణా. ౯౭

క. అజకృతమగునీస్తోత్రము
ద్విజులెవరే న్జదివి లింగదేహవిముక్తిన్
భజియించి కాంచుచుండెద
రజముఖనుతుఁడైన భావనారాయణునిన్. ౯౮

క. శ్రీధరమందరనామక
భూధరధరసర్వసుగుణ భూషణభూనీ
లాధవ తులసీవన మా
లాధర భవనాశ చిద్విలాసరమేశా. ౯౯

భుజంగప్రయాతము. నిరాకారసాకార నిర్ద్వంద్వసేవ్యా
పరేశామహేశాది భక్తాళిభావ్యా
పరానందసామ్రాజ్య భాగ్యాప్రమేయా
సురారాతిసంహార సూరిప్రగేయా. ౧౦౦

గద్య. ఇది శ్రీహయగ్రీవకరుణాపాత్ర కృష్ణాచార్యపౌత్ర వేదవ్యాసాచార్యపుత్ర న్యాయశాస్త్రప్రవీణసంగీతకళాపారీణ బాలసరస్వతీబిరుదభ్రాజమాన శతావధానాశుకవితా విరాజమాన సకల విద్వద్విధేయ కాశీకృష్ణనామధేయప్రణీతంబైన గోష్ఠీవనమాహాత్మ్యంబునం ద్వితీయాశ్వాసము సంపూర్ణము. ౧౦౧

---

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీభావ్యమానచరణా
శోభాజితకోటిసూర్య సురరిపుహరణా
శ్రీబైష్మీహృద్రమణా
భూభారోద్ధరణ సుగుణపుంజాభరణా. ౧

సీ. ఆలకింపుముదేవ, మహావిచిత్ర
మైనకథ నాలకించి హిమాద్రితనయ
సంతసంబునఁ బతిపదసరసిజాత
ములకు మ్రొక్కుచు నిటులనెఁ బొలుపుమీఱ. ౨

క. స్వామీ మీవాక్సుధల
న్నామానసమెల్ల చల్లనం జెందె మహా
ద్దామానుకంపతో నా
కామీందక్షేత్రకథలఁ దెల్పుమన శివుఁడనియెన్. 3

క. వనజోదరుఁడివ్విధమున
నొనరించిన సంస్తవముల నొప్పుగ వినియా
వనజాక్షుఁడనె విరించికి
వనధరగంభీరమధుర వచనరచనలన్. ౪

క. వినిచితిమున్నీ గోష్ఠీ
వనమాహాత్మ్యంబునీకు వనజోదర, పా
వనమగు నీతావునన
గ్గనుఁగొనువారలకు ముక్తికాంత లభించున్. ౫

ఉ. పావనపారమార్థికనివాసము మత్పదదర్శనంబు భ
ద్రావనమజ్జనంబుగల ధన్యుల కింకొకజన్మముండ దీ
తావునఁదారతమ్యమును దక్కుచు మోక్షము నెల్లవారికిన్
దవిగనిచ్చుచుండెదను నీవులయించినదాఁక పుత్రకా. ౬

గీ. సర్వముక్తిదుఁడనుచును సాక్షిదేవుఁ
డనుచు శ్రీభావనారాయణాఖ్యుఁడనుచు
నెవ్వఁడేనియు నన్ స్మరియించెనేని
వానిముక్తునిఁగావింతు వనజగర్భ. ౭

మ పుడమిన్గల్గినయట్టి పావననదుల్మోక్షప్రదక్షేత్రముల్
గుడులుంగూర్చుఫలంబు నీనదియు నీగోష్ఠీవనంబేను ని
క్కడనేకూర్తుఁ ముపుత్ర, తావకవయఃకాలాంతమౌదాఁక యె
క్కడ నేఁజేయుతపంబు లెక్కడఁ గళాకాలంబులోఁ బాడెడున్.

క. విను మన్యక్షేత్రంబులఁ
బొనరించినయశ్వమేధములు మనగోష్ఠీ
వనమున నేకాజ్యాహుతి
కెనవచ్చుటదుర్లభంబనేకగుణాఢ్యా. ౯

క. పాత్రమ్మునందునొకయణు
మాత్రము హేమంబునిట సమర్పింపఁగురు

క్షేత్రమున మేరువుల స
త్పాత్రసహస్రములకిచ్చు ఫలములభించుఁ. ౧౦

గీ. అన్యతీర్థములందు ననంతభూసు
రాళి కన్నంబునిచ్చిన యట్టిపుణ్య
మునకు వేరెట్లు పుణ్యంబుఁ బొందుచుందు
రిచట బాపనికొకముద్దనిడినవారు. ౧౧

గీ. అంబుజోద్భవ యీక్షేత్రమందునాదు
సమ్ముఖంబుననొనరించు సకలదాన
ధర్మములలోన నన్నప్రదానమహిమఁ
బలుక నావంటివానికే యలవికాదు. ౧౨

సీ. నాకొక్కముద్ద యన్నము సమర్పించిన
నఖిలలోకములందు నధికతృప్తి
పారమాత్మ్యస్థుఁడౌ బ్రాహ్మణునకునొక్క
కబళమిచ్చిన మదైక్యంబుగల్గు
కబళార్ధమునఁగల్గు కైలాసపదమొక్క
కబళాన నీదులోకమ్ముగల్గు
కబళద్వయముచేతఁ గల్గుసాలోక్యంబు
పొలుచుసారూప్యంబు పూర్ణభుక్తి

గీ. షడ్రసోపేత దివ్యభోజనమునాకు
నర్పణముసేయువాని వాక్యానుసార
మేనువర్తింతుఁగావున నెల్లదాన
ములకు నన్నప్రదానమే ముఖ్యమయ్యె. ౧౩

క. నలినజ వైశాఖంబున
నెల నడిమిదినంబునందు నేఁబుట్టితినాఁ
డిల నెవ్వారేని నుత్సవ
ములఁజేసినఁ బరమపదముఁ బొందుదురెలమిఁ. ౧౪

క. మజ్జన్మర్క్షణంబున నే
సజ్జనుఁడొకయుత్సవంబు సలిపినఁ దనయా
వజ్జీవముసుఖితుండై
మజ్జగములదాఁటి తుదకు ముక్తింజెందుఁ. ౧౫

సీ. భవ్యచక్రస్వరూపమున భాసిల్లుసీ
క్షేత్రమధ్యముననేఁ జెలఁగుచుందు
వినుము మత్సాన్నిధ్య మునసుంద్రు గరుడ
విష్వక్సేన ముఖముక్తభక్తవరులు
ఘనచక్రనాభి దక్షిణమందుసీవు భా
రతితోడనిలు మనారతముశంక
రుండు సవ్యమునందునుండు నత్రియుఁ
బశ్చిమాశ నారదుఁడు పూర్వాశనుండు

గీ. అష్టదిక్పతులుంద్రునే మ్యష్టదిశలఁ
గూడియుందురు ముప్పదిమూడుకోట్ల
యమరవర్యులు మునులరాగ్రముల వేద
శాస్త్రపౌరాణములునుండు జ్వాలలందు. ౧౬

మ. వినునన్గొల్చుచు భక్తవర్యుఁడగు గోవిందాఖ్యుఁడీభూతలం
బునఁ బుత్రాది సమస్తభోగ జనితామోదంబుతో నాదుచెం
తను గొన్నాళ్ళువసించి కర్మజతను త్యాగంబుఁగావించి యం
తను సారూప్యపదంబునొంది నిరతానందాత్ముఁడై యొప్పెడుఁ.

క. తొలి మూఁడుయుగములఁ బు
ష్కలముగ ధర్మంబునడచుఁ గావునసీ ని
స్తులరూపము వెలయింతును
గలియుగమున శాతిరూపు గలిగిచరింతుఁ. ౧౮

గీ. నాల్గుయుగములయందును నన్నుజూచు
జ్ఞానులకు హేమరూపినై కానుపింతు

గర్మపరులకు దారువిగ్రహముతోడ
దర్శనంబిచ్చుచుండుఁ బద్మప్రసూతి. ౧౯

క. పూజాశాస్త్రములత్రితయ
తాఁజేయఁగవలయు భక్తితత్పరత భర
ద్వాజాఖ్యుఁ డనుదినము నా
పూజలఁ గావింపవలయుఁ బొలుపుగఁ బుత్రా. ౨౦

క. పరమేశు నానతిని విధి
శిరసావహించి పనులఁ జేయించెను శ్రీ
హరి యానతిచొప్పున నం
దరి యెల్లరు వారివారి నియతస్థలులన్. ౨౧

క హరిగోష్ఠీవనమునకపు
డరుదెంచినవార్త వినుచు నాంధ్రనృపుండా
పురజనులఁగూడి శ్రీహరి
దరిసెన మొనరింపఁ జేరె దద్వనభూమిన్. ౨౨

క. వనితావినువారును వీ
రననేటికి వింధ్యనామకాద్రికి యామ్యా
శనుగలయందలు గోష్ఠీ
వనమున కేతెంచిరపుడు పద్మాక్షుఁగనన్. ౨౩

ఉ. అంతటఁ గేశవుండువిన యానతమస్తకుఁడౌచు బందుగుల్
సంతసమొప్పఁ జుట్టిచనఁ జానయుఁగూతురు వెంటరాఁగ శ్రీ
కాంతునిఁజూడవచ్చె నధికప్రమదంబుదలిర్ప నాంధ్రభూ
కాంతుఁడు గూనివాఁనినటఁ గన్గొని మ్రొక్కుచు నిట్లుబల్కెడున్

క. నీకారణమునఁగాదే
లోకేశుఁడు మనపురంబు లోనవసించెన్
మాకయ్యెం గృతకృత్యత
లోకోత్తరనిష్ఠ భక్తలోకవరిష్ఠా. ౨౪

క. నీభాగ్యమెంతయనినే
నోభూసురవర్య నుడువనోపుదు శ్రీవా
ణీ భర్త్రాదులకందని
శ్రీభూకాంతుండు నీకుఁజిక్కుటవలనన్. ౨౬

క. ఓవిప్ర, భక్తవర్యుఁడ
వీవే ద్విజసత్తముఁడవు నీవేయనుచా
గోవిందునితో స్వర్ణపు
రీవిభుఁడానరించెనంత శ్రీపతికినతుల్. ౨౭

సీ. సత్యవ్రతుండంతఁ జక్రాకృతింబొల్చు
క్షేత్రంబునకుఁ బ్రదక్షిణమొనర్చి
జ్వాలస్థితామ్నాయ శాస్త్రస్మృతిపురాణ
సమితిగాంచుచు మ్రొక్కుసలిపి చక్ర
నేమ్యరాగ్రాదిస్థ నిఖిలదేవర్షిసం
తతిపాదములకు వందనమొనర్చి
చక్రనాభిప్రదేశముఁజేరి నల్దిక్కు
లందు నారద పద్మజాత్రిశివులఁ

గీ. గాంచిమ్రొక్కుడి నుతులచే గారవించి
నాభిమధ్యంబునను సదానందమనెడు
వరవిమానంబుఁ దన్మధ్యభాగమందు
నవ్యనవరత్నఖచిత మంటపముఁగాంచె. ౨౮

క. ఆమంటపాంతరమునన్
గోమలదినవాధ బింబకోటితులితమౌ
హేమాసనమునమంగళ
నామునిఁగనె సాక్షి భావనారాయణునిన్. ౨౯

మత్తకోకిల. అంతనానృపసత్తముండు సమస్తరాజ్యధనాదులన్
సంతసమ్ముననొప్పి శ్రీహరి సాత్కరించుచు నచ్చటన్

వింతగానొకపత్తనంబు నవీనపద్ధతిఁగట్టి ని
శ్చింతతో భగవత్పదాంబుజ సేవసల్పుచునుండఁగాన్.

క. ఆపురికి నాపరాత్పరుఁ
డే పరపురియంచు నామమిడెఁ గడుబత్తిన్
భూపతియు నాపురంబున
నే పరివారంబుతోడ నింపుగనుండెన్. ౩౧

వ అంత నాభూకాంతుండ త్రిమునిప్రణీతంబగు నాగమంబు ననుస
రించి నిత్యపూజా, నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వత్స
రోత్సవాదుల నాయాకాలంబులంద చేయించుచు దివ్యగంధ పు
ష్పవస్త్రాలంకారాదులచే భగవత్పూజాకైంకర్యాదుల జరిపిం
చుటయు ౩౨

ఉ. అంతటఁగేశవుండు తనయల్లునిగన్గొని కౌగిలించుచున్
సంతతబాష్పపూర్ణ నయనంబులతో నిటుబల్కె వత్స నీ
యంతటి ధన్యుఁడేఁగనఁ గృతార్థుఁడ వన్నిటనీవ నీవ శ్రీ
కాంతుని బత్తులందు మొనగాఁడవు నీకెనయెవ్వ రల్లుఁడా. 33

సీ. తలక్రిందుగా వనంబులదపంబొనరించు
వానికేనియు నందరానివాని
ప్రాబల్కఁ దలలర్ధ వత్తుగాఁబఠియించు
వానికేనియుఁ బల్కరానివాని
అమితాశ్వమేధాది యాగంబులొనరించు
వానికేనియుఁ గొల్వరానివాని
తనబొడ్డునందున్న తమ్మిలోనెలకొన్న
వానికేనియుఁ జూడరానివాని

గీ. మానితంబుగ శ్రీరమామణియొనర్చు
పూజలనుగొన్చు మిగులనుప్పొంగువాని

హరినిఁ దెచ్చితి వ్రేయల్లుఁడా జగాన
నిన్ను బోలినవారలు సున్న సున్న. ౩౪

ఉ. మానుగలాఁడవంచు నినుగోరి చెప్పఁ జూపునఁ జూచినాఁడ ధీ
హీనుఁడ నాదుజీవిత మిసీ కడుఁదుచ్ఛము సర్వలోక స
న్మానితపాదపద్ముని రమావిభుఁ డేఁగల యట్టిదిట్టనా
మానిసివంచు నిన్ను నణుమాత్ర మెఱుంగకపోతి నల్లుఁడా. ౩౫

చ. అటులనుచున్ మహాత్ముఁడగు నల్లునితోడుతఁ దుంగభద్రలో
బుటుకుననాడి యిందిరవిభున్ గని మ్రొక్కిడి పూర్ణభక్తి సం
పుటితకరారవిందుఁడయి భూరినుతుల్ పొనరించి కేశవుం
డట హరిసన్నిధానమున నల్లునితో నుపవిష్టుఁడౌటయున్. ౩౬

క. అంతన్మోమునఁ జిఱునవ్వు
గంతులు వేయంగ నమల కరుణాపూర్ణ
స్వాంతుండగుచున్ శ్రీభగ
వంతుఁడు కేశవునకిట్లు బలుకఁదొడంగెన్. ౩౭

శా. కాశీపత్తనమందు నాకడఁ బరిష్కారంబుగా నప్పుడే
యాశైవాలిని చెంత నీతనిక మీయమ్మాయి నీవిచ్చి రూ
పాశాగ్రస్తత నీను పొమ్మనుచు నిష్ఠన్యాయముం జేయ నీ
కేశాస్తిన్ బొనరింపఁగావలెనొ నీవే చెప్పవే కేశవా. ౩౮

ఉ. నిర్మలవృత్తుఁడౌచు ధరణీసురపుంగవుఁ డెల్లవారికిన్
ధర్మము సెప్పఁగావలయుఁ దాన యసత్యమునాడి నీవలెన్
ధర్మముదక్కినన్ జగతిధర్మవు నిల్చునెయంచు శ్రీవిభుం
డర్మిలిఁ బల్క బాపఁడు భయంపడుచున్ హరి మ్రొక్కి యిట్లనున్.

ఉ. అందములేనివాఁడు మనయల్లుఁడటంచనుకొంటిఁగాని గో
విందుఁడుసూడ నిట్టిఁడని విన్నదికన్నది లేదు దేవరా
అందునసత్యమున్విడిచి యన్యపథంబును ద్రొక్కినాఁడ నా
యందపరాధముల్ దొలఁచుమయ్య సహింపఁగదయ్య మ్రొక్కెదన్.

ఉ॥ నీముఖచంద్రమండలము నేఁగన నాదురితమ్ముతీరె నీ
నామమునుచ్చరించితిని నాయపరాధమడంగె శ్రీపతీ
సోముఁడు దూర్పుకొండఁ బొడసూపకమున్న ధరాస్థలిన్ దను
స్తోమములుండు నాపయినఁ జాతమటన్నఁ దమంబునిల్చునే॥

గీ॥ భక్తవత్సల సర్వజ్ఞ పరమపురుష
శరణుజొచ్చితి నాతప్పు లరయవలదు
నన్ బ్రపన్ను నిభక్తివినమ్రుననదుఁ
గావవలెనీకు నిదె నమస్కారమయ్య॥ ౮౨

శా॥ ఆమాటన్విని సాక్షిదేవుఁ డనుకంపాంచత్కటాక్షంబులన్
సేమంబొప్పఁగఁ గేశవున్గనుచు నిస్సీమోల్లసత్సద్గుణో
ద్దాముండై తగు గూనిబత్తునికి సౌందర్యమ్ము నిప్పించి యీ
వేమీ పిల్లను గూనివానికని లోకేశుండనెన్ గేశవున్. ౮౩

గీ॥ అంతవేవేగ సత్యవ్రతాఖ్యనృపతి
విప్రుపరిణయమునకొక్క విమలగృహము
బహువిధాలంకృతి వితానభావిభాసి
తముగఁ జేయించె హరిసన్నిధానమందు॥ ౮౪

ఉ॥ భూరిపరార్ధ్యవైభవము బొల్పెసలార వివాహసర్వసం
భారసమేతుఁడౌచుఁ దనబంధుగులందఱు వెంటనంటిరాన్
గేరుచుఁ గేశవుండపుడ కృత్రిమసమ్మద విస్మృతాన్యుఁడై
చేరె వివాహమందిర మశేషజనమ్ములు వింతనొందగన్॥ ౮౫

గీ॥ తనకులాచారధర్మంబుఁ దప్పనీక
మహితలక్షణములుగల మంచిమూర్తిన్
మందు నత్రిభరద్వాజమౌనివరుల
చేతఁ బెండిలిచేయించె క్షితిసురుండు॥ ౮౬

ఉ॥ అందఱుబందుగు ల్ముదమునందఁగఁ గేశవుఁడంత గూనిగో
విందునిచేతులందు సుమబృందయుతమ్ముగఁ గన్నెనుంచి గో

విందువికల్పగింపఁ బృథివీపతి మున్నగు పెండ్లి పెద్దలా
నందముఁ గొంది శ్రీహరి ననంతముఖమ్ములఁ బొగడి వెండియున్ ॥ ౮౭

ఉ॥ అంచితభక్తి నిన్ను హృదయమ్మున నమ్మినవీని గూను వా
రించి సురూపుఁ జేసి సొడ రెండసజందెపుపోగు నెట్లొ వే
యించిన నీదయారసము నెంతని మేము వచింతు మీశ్వరా
యంచు నుతించుచున్ స్వనిలయంబుల కేగిరి విస్మితాత్ములై ॥ ౮౮

క॥ గోవిందుఁ డంత శుభగుణ
శేవధియగు చిన్నదానిఁ జేకొని సంతో
షావధిని గాంచ నేరక
గోవిందుని పాదములను గొల్చుచునుండెన్ ॥ ౮౯

చ హరిపదసన్నిధానమున నానృపుఁడా ధరణీసురుల్ నిరం
తరము వసించి తచ్చరణ తామరసమ్ములఁ గొల్చుచుండి ని
ర్భరసుఖభోగముల్ బడసి బంధవిముక్తిఁ గాంచి మూవురుం
బరమపదమ్ము జేరుకొని భవ్యత నుండిరి విష్ణుసన్నిధిన్. ౯౦

సీ॥ భగుఁ డివ్విధి నాగూని వాని పెండ్లి
ముచ్చటను జెప్ప విని కడు మోదమొంది
పార్వతీదేవి తన పతి పాదములకు
వందనం బిడి మగుడ నీపగిదిఁ బలికె॥ ౯౧

చ॥ వినినకొలంది నాకు విన వేడుకగల్గెడు దేవగోష్ఠికా
వనమున భావదేవునకు భక్తి దలిర్ప నొసంగు నోదనా
ర్పణమహిమంబుఁ జెప్పుమని పార్వతి వేడ భుజంగరాజభూ
షణుఁ డిటులానతిచ్చె నొకచక్రినితొల్లిఁటి రాజవృత్తమున్ ॥ ౯౨

మ॥ కలఁ డిక్ష్వాకుకులావతంసుఁ డఖిలక్ష్మామండలవ్యాప్తని
స్తులనిర్ణిద్రయశఃప్రతాపసితరుక్తోయేజబంధుండు ని
ర్మలధర్మాచరణైకదీక్షుఁ డధికామ్నాయాంత విజ్ఞానని
ష్కలుషాత్ముం డసమానవైభవుఁడు నా కల్మాషపాదుండిలన్.

ఉ॥ ఆధరణీవిభుండు మృగయాకులచిత్తత భీకరాటవీ
వీధులకేగి జంతువులవేనకు వేలువధించుచుండ నా
బాధకుఁదాళలేక తెగఁబాఱెఁడు నొక్కమృగంబు వెంటనే
వ్యాధునిమాడ్కిఁ దానునురయంబునఁ బాఱుచు దారిలోపలన్॥

క॥ తనకభిముఖుఁడై వనమునఁ
జనుదెంచువసిష్ఠపుత్రు శక్త్యాహ్వాయునిన్
గనివేఁటతగులు కోలున
దనన త్తినెఱుంగలేక తనకిట్లనియెన్॥ ౯౫

క॥ మునితిలక నాదు మార్గ
మ్మున నిల్చెదవేల తొలఁగిపొమ్మాక్రవలకం
చనవిని మునియును నీవే
చనుమావలకనుచు రాజచంద్రునకనియెన్. ౯౬

గీ॥ భూతలేంద్ర వసిష్ఠాత్మ జాతశతము
నందు బెద్దనుశక్తిసమాహ్వాయుండ
నీకుఁ గడుఁబూజనీయుఁడ నేనుగాన
నీవనుమ్రొక్కి నాదారినీయవలయు॥ ౯౭

చ॥ అనుటయు భూధవుండు మృగయావ్యసనాపహృతాంతరంగుఁడై
మునికులనాథు నెత్తిపయిమోఁదఁగ నాఋషిరాజు దండతా
డనమున లేచునప్పము బెడంగునఁ గ్రోధవిఘూర్ణితాత్ముఁడై
చనుమిఁక రాక్షసత్వమని శాపమొసంగెను జేనికంతటన్. ౯౮

ఉ॥ ఆమనుజేశ్వరుం డతిభయంకర శాపవిషాహిదష్టుఁడై
యోమునిచంద్ర నేను మృగయోత్సుకతన్ బొరపాటొనర్చితిన్
నా మొఱయాలకింపుమిఁక నాగతిసెప్పుమటంచు నాముని
గ్రామణి పాదపంకజపరాగము సోఁకఁగ వ్రాలె వ్రాలినన్. ౯౯

చ॥ ఇరువదినాల్గువత్సరములేగుడు నీకగుశాపమోక్షమం
చు ఋషికులేశ్వరుండు సన క్షోణితలేంద్రుఁడు తత్క్షణంబ దు

ర్బరతరమైన రాక్షసభవంబును జెంది ధరాతలంబునన్
నగతను మాంసభక్షణమునన్ జరియించుచునుండ నొక్కటన్.

ఉ॥ ఆసురభావదుష్టుఁడు ధరాధిపుఁడావనమందు నాఁకటన్
జేసిచరించుచుండఁగ వసిష్ఠసుతుండగు శక్తియచ్చటన్
డాసిననామహాత్మునిఁ దటాలున క్రమ్మంగుచు వాని ప్రాణముల్
దీసి స్వకీయమాత్మగురువు దీర్చుకొనెన్ గడు ఘోరవృత్తుఁడై॥ ౬౧

క॥ ఇట్టులనాకట్టేఁడిసల
పట్టి వసిష్ఠాత్మజులనుబట్టుక తినుచున్
తుట్టతుద కందఱినిఁ దన
పొట్టన పెట్టికొనినీళ్ళుపోసికొనెఁ జుమా॥ ౬౨

గీ॥ అంతనరపతి తనకు శాపాంతమాటఁ
బూర్వరూపంబుగైకొని పొల్పుమీఱఁ
బత్తనము సేరనట మునిప్రవరులతనిఁ
గాంచిసెలవిచ్చి రొకమాటఁ గఠినముగను॥ ౬౩

గీ॥ శక్తిముఖ్య వసిష్ఠాత్మజాతశతముఁ
జంపినాఁడవు నీశాపసమయమందుఁ
గాన బ్రహ్మఘ్నుఁడవునీవు మానవేంద్ర
పుడమి నేలంగ నింక నర్హుఁడవుకావు॥ ౬౪

క॥ అప్పటి పాపంబంతయు
నిప్పుడు నినుజుట్టుకొనె నహీనవిధానం
బొప్పఁగఁ బ్రాయశ్చిత్తము
తప్పక చేసికొనుమికఁ యథాశాస్త్రముగాన్॥ ౬౫

ఆ॥ వారిమాటవినుచు వసుధావిభుండంత
శ్రేష్ఠుఁడైన యావశిష్ఠుకడకుఁ
జేరి గురునిచరణ నీరజమ్ముల నాత్మ
శిరము వ్రాల్చియిట్లు చెప్పఁదొడఁగె॥ ౬౬

ఉ॥ శాపమునొందినే నతినృశంసతముండగు రాక్షసుండనై
తాపసవర్య నీసుతశతంబును మున్నమయించినాఁడ నా
పాపము నన్నుఁ జుట్టుకొనె బ్రగ్గనమందుచునుంటినాఁడు సం
తాపము బాపి ప్రోవఁగల ధన్యుఁడవీవని నిన్ను జేరితిన్॥ ౬౭

క॥ తాపసయిప్పుడు పశ్చా
త్తాపంబునఁగుందునన్ శతఘ్నునిదుష్టున్
గోపము సేయక కావుము
నీపరమ కృపారసంబు నింపుచునాపై॥ ౬౮

క॥ బ్రహ్మఘ్నుఁడ మఱియు శత
బ్రహ్మఘ్నుఁడ దానమాని బ్రహ్మఘ్నుఁడనా
బ్రహ్మఘ్నత గురుసుతశత
బ్రహ్మఘ్నుఁడనైతినయ్య బ్రహ్మర్షివరా॥ ౬౯

క॥ మావంశంబున కీవే
దైవంబవు గురుఁడవాప్తతముఁడవు చెలివిన్
గావున నిన్ను వినా నా
కీ వృజినమడంచు వారలెవరు మహాత్మా॥ ౭౦

గీ॥ రాజుపల్కుల వినిముని రాజుపల్కె
నొక్కహత్యకె నిష్కృతియుర్వి లేదు
మునిశతంబును జంపిన ముష్కరుండ
వేవిధంబున నీకు నిష్కృతిలభించు॥ ౭౧

క॥ ఐనన్నీపయిఁగల్గిన
నూనదయన్ సులభమైన యొక్కయుపాయం
బేను వచించెద డెందము
బూనికతో నిల్పి దానిఁ బొల్పుగ వినుమా॥ ౭౨

ఉ॥ అన్నము సర్వపాపహర మన్నము బ్రహ్మమయంబు చూడఁగా
నన్నమె సర్వప్రాణమయ మన్నిటికన్నమె మృత్యుదంబు ను

మ్మన్న మె సర్వజీవనదమట్లవు టన్న ప్రపయన్న దానమే
యన్నిటికంటె ముఖ్యమగునందున నీదురితంబడంగెడుఁ. 23

గీ॥ పాత్రముల తారతమ్యంబుఁబట్టి యన్న
దానపరులకు ఫల తారతమ్యముండుఁ
గాన ధరణీపురందర దానివిధము
నేవచింతును వినుము నిర్నిద్రబుద్ధి॥ 24

క॥ మాలనికన్నంబిడఁగా
దూలును సూక్ష్మతమమైన దురితములెల్లన్
మేలుగ శూద్రునకిడినన్
నీలుగు లఘుపాతకముల నేకములు నృపా॥ 25

ఉ॥ కోమటి కన్నమిచ్చినను గూలును మధ్యమపాతకంబు భూ
స్వామికి నోగిరంబిడ ననత్యజపాతకము ల్నశించెడున్
క్షామమృతభుక్కు సాపఱుప హత్యనుగల్గిన పాపమేగునో
భూమిపభ్రూణహత్యనను బొల్పుగ వేదికిఁ దిండిపెట్టినన్॥ 26

సీ. వినుసోమయాజికో దనమీయస్త్రీహత్య
రూఢిగాఁజనునొక్క శ్రోత్రియుండు
భోజనంబొనరింపఁ బోవుస్వర్ణస్తేయ
మధిప బ్రహ్మచారి కన్నమిడిన
మద్యజపాపంబు మడియుపట్భాస్త్ర వే
దాంతజ్ఞుఁడేక వారాశనమ్ముఁ
గుడుపదక్షణమేగు గురుతల్పమొకయోగి
నేనివానప్రస్థు నేనిఁగుడుప

గీ. నపుడసమయును గోహత్య, యతియువిష్ణు
భక్తుఁడొకమారయినను సాపడినబ్రహ్మ
హత్యలాఱును సర్వాత్ముఁడైనహరికి
నన్నమర్పింప మునిహత్య లపుడతొలఁగు. 22

క. కావునసనో నృపకుంజర
యేవిధిచేనైన విష్ణుహృదయమునందుఁ
నీవన్నంబర్పించినఁ
దావక మునిహత్యలెల్ల దగ్ధములగుఁ. ౭౮

వ. అంత నానృపుండు గురువర్యుండగు వసిష్ఠమహర్షి కిట్లనియె.

ఉ. అంతటిపాపినేనొసగు నన్నము వెన్నుఁడెటారగించు నే
నుంత తపంబొనర్చి యెటొ శుద్ధుఁడనై హరిఁగొల్చినన్దయా
స్వాంతుఁడు భావదేవుఁడు మదన్నముగంటనె కాంచుగాని యా
వంతయు నోటఁబెట్టఁడిపు డందున కేమి యుపాయమో మునీ.

సీ. అనవసిష్టుండిట్టులనెఁ బాంచభౌతిక
బ్రహ్మాండమిదియెల్లఁ బ్రాకృతంబు
పరమాత్మలోకమ ప్రాకృతంబగుదివ్య
వైకుంఠమదిముక్త వర్గయుతము
ప్రాకృతులాత్మ విగ్రహపోషణార్థమై
యాతనన్నముమ్రింగ వలయునంచు
వైకుంఠలోక సంవాసులకాహార
దృష్టిచేనగు సుఖపుష్టియంచు

గీ. కమలనాభునిదివ్య సంకల్పమట్లు
గాన జిహ్వేంద్రియముచేత గల్గుతృప్తి
గలుగునేత్రానన ప్రాకృతులకునొక్క
యింద్రియమెచాలు విషయసంతృప్తినొంద. ౭౯

క. ఓప్రాకృతబుద్ధీవిను
మప్రాకృత దివ్యమంగళాకారుండా
శ్రీప్రాణేశ్వరుఁడేయా
దిప్రార్చ్యావిగ్రహములఁ దిరముగనుండుఁ. ౮౦

క. అర్చలకును నప్రాకృత
వర్చోమూర్తికిని భేదభావలవంబే
జర్చింపలేముగావున
నర్చింపుము విష్ణువిగ్రహములతిభక్తిన్. ౧౩

గీ. అర్చలందుండి భగవంతుఁ డఖిలభక్త
వరులొనర్చెడుపూజలఁ బరమతుష్టి
సేకరించుచువారిక ప్రాకృతాత్మ
లోకమిచ్చుచునుండు నృలోకపాల. ౧౪

క. మునుఁ గడుఁబ్రఖ్యాతినిబొం
దెను బుణ్యక్షేత్ర మాంధ్రదేశమ్ముననా
ఘనగుహ్యాతమస్థలమున
వనజాక్షుఁడు చెలఁగుచుండు భక్తులఁబ్రోవన్. ౧౫

ఉ. అచ్చట నెవ్వరేనతని కర్చనసేయుచు దివ్యభోజనం
బిచ్చిన నారసమ్మునిజదృష్టి బలమ్మునఁబుచ్చికొంచుఁదా
నిచ్చుచునుండు మోక్షసుఖ మీవిపుడచ్చటికేగి యన్నమున్
జెచ్చెర శ్రీధరార్పితము సేయుమటన్ శతవారముల్ నృపా.

చ. మునివరుపల్కులన్ వినుచు మోదమెలర్పఁగ రాజచంద్రుఁడా
మునివరుతో నమాత్యకులముఖ్యులతో ధరణీసురాళితోఁ
దన ఘననాగఘోటక శతాంగపదాతిబలంబుతో సుహృ
జ్జనములతోడఁగూడికొని సాగెను వేగమె యాంధ్రభూమికిన్.

ఉ॥ ఈవిధిఁ గొన్ని వాసరము లేగుడు దారినిరానురానుగో
దావరిఁజేరి యచ్చటయథావిధి దానమొనర్చిభక్తి స
ద్భావనదేవమౌని పితృతర్పణము ల్పచరించియంతనా
భూవరుఁడేగి ధర్మపురిఁబుంమృగమూర్తినిఁగాంచిమ్రొక్కుచున్

క॥ స్తోత్రంబుల కా నరహరి
బాత్రునిగావించియుచట భక్తిన్మూఁడా

రాత్రులనుగడపి యంతఁ బ
విత్రాంబుశ్రేణి కృష్ణవేణికినడచెన్ ॥ ౮౯

ఉ॥ ఆనదిమున్ను కృత్యములనన్నియుఁ దీర్చుక మంగళాద్రిలో
శ్రీనరసింహుపూజ లొనరించినపిమ్మటఁ బారమాత్మ్యమున్
స్థానముఁజేరి దానికిఁ బ్రదక్షిణము న్బొనరించి తుంగభ
ద్రానదికేగి పద్మజసరస్సును గన్గొని భూపుఁడందులోన్ ॥ ౯౦

ఉ॥ స్నానులవెంటఁబెట్టికొని మజ్జనమాడి నృపుండసంఖ్య గో
దానములన్ సువర్ణమణిదానములన్ ఘనగోష్ఠికావన
స్థాననివాసిభూసురులఁదన్పుచుఁ జక్రసరోవరాహరి
స్థానముఁజేరి మ్రొక్కులిడె సర్వసుపర్వుల కచ్చటచ్చటన్ ॥ ౯౧

గీ॥ నలినజేశాన నారదాత్రులను గొల్చి
చక్రమధ్యమ్ముఁజొచ్చి యాత్మవిభుండు
దివ్యమణిహేమవిద్యుతి దీప్యమాన
మగు సదానందమునుగాంచి యచటనిల్చె ॥ ౯౨

ఉ॥ అచ్చట భావదేవుఁడు సమస్తజనంబుల కాత్మదర్శనం
బిచ్చి ధరాతలేంద్రునకు నీయకపోవఁగ ఱేఁడు ఖిన్నుఁడై
చెచ్చెర నాగురూత్తము వసిష్ఠున్మ్రొక్కుచు "భావదేవుఁడో
సచ్చరితామదత్తులకుఁ జాటయిపోవుటయేల" యంచనన్ ॥ ౯౩

గీ॥ మునులజంపినయఘము నీమోమునందు
నిలిచి కన్పట్టుచున్నదో నేలఱేఁడ
కావునఁబరాత్పరుఁడు నీదుకంటఁబడఁడు
సుమ్మని మునీశ్వరుఁడు చెప్ప క్షోణివిభుఁడు ॥ ౯౪

క॥ విని యంతఁ దుంగభద్రా
ఘనతటమున సత్రములనుగట్టించి మనో
హరభక్ష్యభోజ్యలేహ్యని
కరములవండించి పాచకప్రవరులచేఁ ॥ ౯౫

గీ॥ అనుదినంబును లెక్క లేనంతమంది
నాల్గుజాతులవారి కనాథులకును
బధిరపంగ్వంధులకు నతిభక్తితోడ
నన్నమిడుచొక్కవత్సరం బచటనుండె॥ ౯౬

ఉ॥ అంతవసిష్ఠునింగనుచు నానృపుఁడిట్లనునోవసిష్ఠయ
శ్శాంతతపోగరిష్ఠవిను రాజపురోహితులందుభేద మె
క్కింతయు లేదటంచు మునుపేవినియుంటి మదర్థమీవు శ్రీ
కాంతునికోదనార్పణ మఖండముగా నొనరింప వేడెదన్॥ ౯౭

చ॥ మునియునువల్లెయంచుఁ గడుఁబూనికతో నియమంబుదాల్చి శో
భన కుసుమాంబరాదుల నవారిగ శ్రీహరిపూజఁజేసి పా
వనమగునన్నపానము లపారముగాసిరిజేనికిన్ని వే
ద నమొనరించుచున్ దినశతంబును బుచ్చెను స్వామిసన్నిధిన్॥

గీ॥ అంబుజేక్షణుఁడీరీతి ననుదినమ్ము
మునికరార్పితమగు నన్నమును గ్రహింప
దినమునకు నొకహత్యచొప్పున నశించి
నూఱుహత్యలుజేనికిఁదీఱెఁ గుదకు॥ ౯౯

చ॥ పరమపవిత్రుఁడైన నరపాలుకప్పుడు నదివ్యహాటకాం
బరధరుఁడిందిరామణి విభాసితవక్షుఁడు గోటిమారది
వ్యరుచిరమూర్తిశాలియు, దరారిగదాబ్జ చతుర్భుజుండు శ్రీ
ధరుఁడుహసన్ముఖాబ్జుఁడయిన దర్శనమిచ్చెనునమ్ము పార్వతీ॥ ౧౦౦

ఉ॥ సామ్ములకెల్ల సామ్మయిన సోయగమున్గలవానిఁజూచి పా
దమ్ములమ్రొక్కి యంజలివిధానమునన్గొనియాడుజేనిఁదా
నిమ్ముగఁగాంచి శ్రీదయితుఁడిట్టులఁబల్కెనుజేఁడనీదు పా
పమ్ములు నెల్లనీదయినభక్తికిమెచ్చితినంచు వెండియున్॥ ౧౦౧

క॥ నీవంశమ్మునఁ బుట్టుక
గావించెద రామనామకలితుఁడ నగుచున్

భావించుచు ననుమదిలో
సేవింపుము నా పద సరసీజములనఘా॥ ౧౦౨

క॥ పౌష్మిక ధర్మమున రా
జ్యమ్మును గాపాడికొనుమనంతరమున దే
హమ్ము విడనాడి నానిక
టమ్మున నివసించెదుత్కట ప్రమదముతోన్॥ ౧౦౩

క॥ ఇంతీ వినుమంతట భూ
కాంతుండుగత పాపుఁడగుచుఁ గ్రక్కునఁజని ని
శ్చింతతధరనేలి రమా
కాంతుని దయచేత ముక్తికాంతన్గనియెన్॥ ౧౦౪

క॥ శ్రీరామాంచితవక్షా
తారేశసదృశవక్త్ర తామరసాక్షా
ఘోరాఘహరణదక్షా
నారాయణదేవపక్ష నతజనరక్షా॥ ౧౦౫

మాలినీ॥ సతతభువనపాలా సాధుసంతానసాలా
వితతసుగుణజాలా వేణుగోపాలబాలా
పతగగ, సురముఖ్యాభక్తదత్తాత్మసఖ్యా
ప్రతతలసదభిఖ్యా భావనారాయణాఖ్యా॥ ౧౦౬

గద్య. ఇది శ్రీహయగ్రీవకరుణాపాత్ర కృష్ణాచార్యపౌత్ర వేదవ్యాసాచార్య పుత్ర న్యాయశాస్త్రప్రవీణ సంగీతకళాపారీణ బాలసరస్వతీబిరుద భ్రాజమాన శతావధానాశుకవితా విరాజమాన సకల విద్వద్విధేయ కాశీకృష్ణనామధేయ ప్రణీతంబైన గోష్ఠీవనమాహాత్మ్యంబునం దృతీయాశ్వాసము సంపూర్ణము. ౧౦౭

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీకామినీ కళత్రా
లోకేశ్వర సామగానలోల పవిత్రా
రాకేశతులితవక్త్రా
పాకార్యాద్యమరవినుత భవ్యచరిత్రా॥ ౧

క॥ అవధారు భక్తవత్సల
భవహర, కల్మాషపాద వసుధేశకథన్
శివవిని సంతసమునఁ దన
ధవునిపదంబులకుమ్రొక్కి తగనిట్లనియెన్॥ ౨

ఉ॥ ఓదయమానమానస, మహోక్షగ, శంకర, ఫాలనేత్ర, కా
కోదరరాజభూషణ, మహాహ్యాగ్ర, భవన్ముఖనిస్సరత్కథా
స్వాదమొనర్చి నామనము సంతసమొందినదింకఁ దుంగభ
ద్రోదయమాదిగాఁ గలుగు నుత్తమచిత్రచరిత్రఁ జెప్పవే॥ 3

శా॥ సారాంశంబుగ్రహించి భక్తిగలదై సర్వంసహాభృత్కుమా
రీరత్నంబిటు విన్నవించుకొన గౌరీనాథుఁడంత న్సుధా
సారంబు న్గురిపించునట్లు నిజవాచాచాతురిం జూపుచున్
నారీరత్నమ విస్మవిస్మనుచు నానందంబుతో నిట్లనున్॥ ౪

క॥ మునుహిమవచ్ఛృంగంబునఁ
దనభక్తులమైనమనకుఁదగఁ బరిణయమున్
బొనరించువేడ్క శ్రీహరి
చనుదెంచెను దేవమౌని సమితియుతుండై॥ ౫

గీ॥ అప్పుడీరేడులోకంబు లచటజేర
బరువుచేభూమి యుత్తరభాగమందు
బలిని కేతనమంటఁగఁ బైకిలేచి
స్వర్గమునకంటె దక్షిణభాగమబల॥ ౬

క॥ చప్పనసర్వదివౌకసు
లిప్పుడు మనలోగరిష్ఠుఁడెవఁడని మదిలో
నొప్పుగనూహించుచుఁగడు
గొప్పనుగానేర్పఱచిరి కుంభోద్భవునిన్॥ ౭

క॥ ఈవిఘ్నము వారింపఁగ
నీవిపుడాయామ్యదిశకు నేగుమటంచున్
దేవతలు తన్ను వేడఁగ
భావంబునఁ గుంభజుఁడు వివాహాదిదృతున్॥ ౮

క॥ ఈపనికి నేనుబోయిన
నాపరమేశ్వరుని పరిణయాలోకమునా
కేపగిది గల్గుఁగావున
నీపనిఁదప్పించుకొందు నేవిధినైనన్॥ ౯

ఆ॥ అంతఁదనకుఁదానయాయగస్త్యమహిమున్
మనములోననిట్లు మథనపడుచుఁ
దుదకునొక్కయుక్తితోఁచఁగ దివిజులఁ
బిలిచియిట్టులనియెఁ బ్రీతితోడ॥ ౧౦

గీ॥ శిష్యులెవ్వరు లేరు నా చెంతనిపుడు
వలసినప్పుడు నాకింత జలముఁదేర
నొక్కడుండిన మీపనినొప్పికొందుఁ
గాన నాకొక్కశిష్యుండు గావలయును॥ ౧౧

గీ॥ అటులఁబల్కిన మునిపల్కులాలకించి
భక్తవత్సలుఁడైనట్టి పరమపురుషుఁ
డపుడు మనపెండ్లియందున్న యాదరమున
శిష్యునిత్తును బొమ్మంచుఁ జెప్పెమునికి॥ ౧౨

క॥ మునివర్యుఁడపుడు భగవం
తునియానతి నిదియుఁదనకుఁ దొలగదనుచు ద

క్షీణమున కేగె నతని వెం
టనె హరియేశిష్యుడై హుటాహుటి నడచెన్ ॥ ౧౩

క॥ ఆవడువునఁ దాపసి గో
దావరిఁ దరియించి సహ్యధాత్రీధరమున్
దావడిఁ జేరఁగఁ జనియుం
తేవాసీజలము తెమ్ము తెమ్మని పలికెన్ ॥ ౧౪

సీ॥ భగవంతుఁడపుడు సత్వరరూపుఁడౌచు
సహ్యాద్రిపై నెక్కి పద్మాసనమున
నుండి యోగమునందు నుండనాతనిదేహ
మందుఁ గృష్ణానది యవతరించె
వేణియుం దుదయించె వేణి దక్షిణహస్త
మందుఁ దుంగయు వామమందు భద్ర
బుట్టెనీనదులను బురుషోత్తముఁడు పిల్చి
మరుభూతలములందుఁ దిరుగఁబనిచె

గీ॥ నంతగృష్ణయు వేణియు నైక్యమొందెఁ
దుంగయును జేరుకొనె భద్రతోడనిటుల
నాల్గు రెండౌచుఁ గడుదవ్వు నడచినడచి
శ్రీగిరికి వెన్కనన్నియుఁ జేరెఁగృష్ణ॥ ౧౫

గీ॥ తనకుముందఱ శ్రీగిరి తనరుకతనఁ
బదవిలేకున్కి గృష్ణయాభాగమందె
పెక్కుచోటులఁ దిరుగుచుఁ బృథివినెల్ల
జలముసింపుచునుండఁగాఁ జక్రికినిసి॥ ౧౬

క॥ తనచక్రంబున భూధర
మును హరితెగనఱకనచటను త్రెరువులు పు
ట్టెను వానినుండి వెండియు
జనుదెంచెను మూడునదుల సాధ్యరయమున్ ॥ ౧౭

గీ॥ తుంగభద్రమ్మవిడివడి దురముతోడఁ
బారమాత్మ్యసద్ధమైనట్టి బ్రహ్మసరసిఁ
జేరియటనుండి పూర్వాబ్ధిఁ జేరనపుడు
కృష్ణవేణమ్మ భద్రపైఁ గినిసిపలికె॥ ౧౮

క॥ ఎంతటిదూరమొ నాయ
భ్యంతరముననుండి యుద్ధహోవిడితెన
న్నింతటనుండియు నీయ
భ్యంతరమున జలము శూన్యమయ్యెడుఁగాతన్॥ ౧౯

గీ॥ కృష్ణవేణమ్మ యిటుశపియింపఁ దుంగ
భద్రమదిలోనఁ గుందుచుఁ బారమాత్మ్య
మందుఁబరమాత్మకై తపమాచరించి
కమలనాభునిఁ గన్నులఁ గాంచెనంత॥ ౨౦

ఉ॥ అంచితభక్తి నాహరిపదాబ్జములన్ బ్రణమిల్లిపల్కె నో
కాంచనచేల "నిజము లవ్పుకమ్మ"ని కృష్ణశపించెనన్ను నేఁ
గొంచెపుదాననైతినిఁకఁ గుంభినిలోపలనున్న యేళులన్
దించుక గొప్పదాననని పించుము నన్మధుకైటభాంతకా॥ ౨౧

గీ॥ అనుచు వేడిన తుంగభద్రనురమేశుఁ
డాదరించుచునిట్లనె నన్నినదుల
లోననిన్బెద్దఁ జేయుదు మానసమునఁ
జింతఁదొఱఁగుము వినుము నిశ్చింతతోడ॥ ౨౨

గీ॥ గంగ వెడలెను నాపాదకంజమందుఁ
గృష్ణజన్మించె నన్మచ్ఛరీరమందు
నీవుమద్బాహువునఁబుట్టినావుగాన
దుంగభద్రమ్మ నీవయుత్తుంగవౌదు॥ ౨౩

క॥ కావేరియుఁ గృష్ణయు గో
దావరి భాగీరథియు సదాపావనివౌ

నీవునుమీయేవురు పు
ణ్యావహాలై పంచగంగ లనఁబడుదురిలన్॥ ౨౪

గీ॥ గంగ లేనింటిలోననుత్తుంగవగుచు
భద్రదాయినివై తుంగభద్రయనెడు
సార్థకాభిధనొప్పి యీయాత్మ్మతలమునఁ
గీర్తినొందెదు మంగళమూర్తివగుచు॥ ౨౫

చ॥ నలినభవాండమొండు మునునాశనమొందెడు వేళ దానిలో
పలఁగల కోటితీర్థములఁబాపహరమ్ములస్పర్శమాత్ర ని
ర్మలశుభముక్తిదమ్ములను మామకకూర్మశరీరమందు ము
న్నిలిపితివానినేనిపుడు నీజఠరమ్మున నుంతు దానిచేన్॥ ౨౬

గీ॥ ధరణిఁగల్గిన సర్వతీర్థములలోన
నీవయుత్తమవై యుండి నీదునీట
మునుఁగు పుణ్యాత్ములకునెల్ల ముక్తినిడుచు
నుండెదవుసుమ్ముమఱియు నింకొకటినమ్ము॥ ౨౭

క॥ కొంచెము త్రవ్విననీలో
నుంచిన తీర్థములు శుభతరోదకమును జూ
పించి స్పృశియించినంతనె
యంచితముఁగ ముక్తినొసఁగు నఖిలనరులకున్॥ ౨౮

క. అని హరిపాతాళమునకుఁ
జని కూర్మాంతస్థ తీర్థజాలమ్మును గై
కొని పారమాత్మ్యమునకునుఁ
బునరాగతుఁడయ్యె నొక్కముహూర్తములోనన్. ౨౯

గీ. అంతటను దుంగభద్రోదరాంతరమునఁ
గోటితీర్థమ్ములనునిల్పి కైటభారి
తుంగభద్రమ్మతోడ నుత్తుంగకరుణ
గదురవెండియు నొక్కవాక్యమ్ముఁ బలికె. 30

సీ. నాపురోభాగాన నలినగర్భుఁడు తొల్లి
స్వయముగా నొక సరోవర మొనర్చి
అబ్జజాండాంతస్థ సార్ధత్రికోటి తీ
ర్థముల నాదివ్య సరస్సులోన
మూఁడుదిక్కులయందు ముక్కోటితీర్థముల్
యామ్యదిగ్భాగాన నర్ధకోటి
తీర్థమ్ములనునిల్పి తిరముగా మధ్య భా
గముననిల్పెను బాల కడలినంత

గీ. నాల్గుమూలలయందును నాల్గుసంద్ర
ములనునిల్పుచు నుత్తరమునసురాబ్ధి
నిల్పి శుద్ధోదకాబ్ధిచే నిఖిలసరసి
నించి యుత్కృష్టతీర్థమన్పించె దాని. ౩౧

క. ఆసరసిలోన నీవును
జేసితివిప్రవేశమందుచే నీస్థలిలో
మీాసంగమముత్తమమై
దోసములనడంచుఁ గనినఁదోడ నరులకున్. ౩౨

గీ. చక్రనాభిసరఃప్రవేశములు గల్గు
నిన్ను స్పృశియించినంతనె నిఖిలజనులు
ప్రాకృతాంగంబునదలి యప్రాకృతంపు
దివ్యదేహంబుఁగాంత్రు సందియములేదు ౩౩

గీ. జరులువైశాఖ పూర్ణిమాసమయమందు
నేనియువిశాఖయను చుక్కనేనిస్నాన
మాచరించుచు బ్రహ్మహత్యాది పాత
కములఁబాయుచు ముక్తినిఁ గాంచుచుంద్రు. ౩౪

క. అతులితమగు నీజలమునఁ
బితృతర్పణము నొనర్చి విప్రులపితరల్

సతతము నాలోకంబున
మితిమీఱిన సుఖమునొంది మెఱయుదువు సుమీ. ౩౫

క. జపమును దానము హోమము
తపమును శ్రాద్ధంబును బితృతర్పణమును నీ
విపులతటమ్మునఁ జేసిన
నపరిమిత ఫలదమగుచు మదైక్యము నొసఁగున్. ౩౬

సీ. నీబిందు లేశంబె నిఖిలతీర్థఫలంబు
లిచ్చునీస్మృతిచేత నెల్లపాప
ములడంగు నీతీరమునఁ జేయు ధర్మంబు
విధిహీనమయ్యును విపులసిద్ధి
నొసఁగునీతీరాన నొనరించునొకజన్న
మగు నశ్వమేధ సహస్రసమము
త్వత్తీరముననొక్క తరువునుంచినవాఁడు
వనసహస్రస్థాపకునకు జోడు

గీ. చెలఁగి యశ్వత్థమునునేనిఁదులసినేని
నీతటంబుననుంచిన నిర్మలాత్ముఁ
డఖిలపాతకములఁబాసి యస్మదీయ
లోకముననుండు నిర్గత శోకుఁడగుచు. ౩౭

క. ఈనిఖిలతీర్థచయములు
మానుగ వైశాఖపూర్ణిమన్మఱియు విశా
ఖానక్షత్రంబునఁ దమ
తానకములకరిగి నీదుదరిమగుడజనున్. ౩౮

గీ. సర్వతీర్థసమాగమ సమయమందు
నిన్ను గన్గొన్న మోక్షంబు, నిర్స్పృశింప
మత్సమీపము, స్నానమత్సరూప
మంబుపానాన సాయుజ్యమందునరుఁడు. ౩౯

క. అని వరములిచ్చి శ్రీహరి
కనుచూపైచనియె నాఁటికాలంబు మొదల్
కొని తుంగభద్రతీరం
బున గలవారికిసరూపముక్తి లభించున్. ౪౦

క. కృమికీట కాదులును దా
హముచేఁ దన్నీరలవము నానినచో మో
క్షముఁ జెందునింక నెంతగ
హిమగిరిజా తుంగభద్ర నే వర్ణింతున్. ౪౧

ఉ. ఈవిధిజీవసంఘముల దేవనిగా హరిఁజేరుచుండ నీ
భూవలయంబునం జనులు పూజ్యముగా విధిశర్వపూర్వదే
వావళితిన్నఁగా సరసిజాక్షుని సన్నిధి కేగి భక్తిస
ద్భావముతోడ మ్రొక్కి నుతివాక్యములన్ గొనియాడి యిట్లనున్.

ఉ. సారసనేత్ర నీదగు ప్రసాదబలంబునఁ దుంగభద్రయే
వారికి నాత్మతీర్థపుఁ బ్రభావమునన్ క్షణముక్తినిచ్చు నీ
తీరగు నేని జీవుఁడెక్షితిన్గను పెంచఁడుగాన దేహముల్
తీరినవెన్కఁగాని ముగితిన్ దయసేయఁగఁబోకు మీశ్వరా. ౪౩

గీ. ఇటుల వేడిన వేల్పుల యిచ్ఛకనుగు
ణంబుగాఁజేసె హరియాదినంబుఁదొట్టి
పార్వతీవింటివే తుంగభద్రమహిమ
చెప్పితినిగా మఱియు దేనిఁ జెప్పవలయు. ౪౪

ఉ. దేవ, కృతార్థురాలనయితిన్ భవదీయముఖోద్గ తుంగభ
ద్రావరనిమ్నగా ఫలసుధారసపానముఁజేసి యింక గో
ష్ఠీవనమందుఁగల్గిన విశేషములెయ్యవి చక్రరూప మా
తావునకేలఁగల్గెనో సదా శివనాకిపు డానతీయవే. ౪౫

చ. అనవిని శంభుఁడిట్టులను నద్రిసుతా వినుతొల్లి సృష్టికై
వనజభవుండు భూతములఁ బంచినపన్నును బంచభూతము

ల్గొనకపరస్పరంబు గుమిగూడి యొకానొకచోటనట్టి చె
య్యునుదొలఁగించుకొందమని యోజనసేయఁదొడంగె నిట్టులన్.

చ. గురుతరసృష్టికార్యమునకు న్మనమొప్పిన విష్ణుసేవకున్
గరమతిదూరవర్తులముగావలెఁ జిత్తముసృష్టియందను
స్థిరతవహించుదానఁ గడుఁ జిక్కులపాల్పడఁ గావలెన్గుసం
సరణమహాబ్ధిలోనఁబడి చచ్చుచుఁబుట్టుచునుండ నేటికిన్. ౪౭

క. కావున నెప్పటికిని హరి
సేవయెముక్తిదముగాన స్థిరతరభక్తిన్
శ్రీవరు నెదనిల్పుచు మన
మేపురముదపంబు సేయ నేగుదమనుచున్. ౪౮

గీ. పంచభూతంబులిట్లు పరస్పరము నిశ్చ
యించికొని పారమాత్మ్యమహీతలమునఁ
జేరి యష్టాక్షరముచేత శ్రీవిభునకుఁ
దపమొనర్చుచునుండెను దారుణముగ. ౪౯

క. అంతయుఁగన్గొనివాణీ
కాంతుఁడు వేవేగ గోష్ఠికావనమునకున్
సంతసమునఁజని కమలా
కాంతునిగొనియాడె భక్తికలితుండగుచున్. ౫౦

గీ. సర్వగీర్వాణవందిత చరణకమల
భక్తవరదానపర, దేవ, పరమపురుష
వేదవేదాంగవేద్య, గోవింద, శ్రీశ
నన్నుగృపతోడఁబ్రోవుము నళిననేత్ర. ౫౧

క. కరుణాసాగరనిను నే
స్మరణము గావించుచుంటి సతతముమదినీ
సరివేల్పులెవ్వరీధర
కరిరక్షక కావుమయ్య కమలాకాంతా. ౫౨

క. వక్షస్స్థల విధృతేందిర
రక్షఃకులదారిచక్ర రాజద్బాహూ
పక్షీంద్రగమన నీసరి
దక్షులు లేరే జగాన దాసులఁ బ్రోవన్. ౧౩

క. అని కొనియాడెడుబమ్మకు
వనజాక్షుఁడు భూషణాళి భాసురుఁడై ద
ర్శనమీయ నావిధాయతయు
వనజాక్షున కెఱఁగియిట్లు పలుకఁదొడంగెన్. ౧౪

చ. పుడమియు నీరుమున్నయిన భూతములైదును నాదుమాటలన్
జెడ చెవిఁబెట్టి సృష్టికయి పిల్చిన రాక నిరాకరించి యి
య్యెడగుమిగూడి నీకొఱకు నేకముఖంబున ఘోరమౌ తపం
బెడపక చేయుచుండెనిఁక నేవిధిసృష్టినొనర్తు దేవరా. ౧౫

క. క్షిత్యాదికములను వినా
కృత్యంబే లేదు నాకు నీజన్మమునన్
సత్యము, కావునముందిఁక
గత్యంతర మేమినాకుఁ గంజదళాక్షా. ౧౬

క. అనవిని కమలాకాంతుఁడు
తన వెంటవిరించిరాఁగఁ దద్దయుఁ బ్రీతిన్
జని పంచభూతముల క్రమా
లనునిలిచెనురంబునందులచ్చి సెలంగన్. ౧౭

చ. వరమణికుండలద్యుతి విభాసితగండుఁగన త్కిరీటభా
సురతరమస్తకున్మణివిశోభిత పీనవిశాలవక్షు ది
గ్మరుచిసహస్రకాన్తియుతుఁ గంకణముఖ్య సుభూషణాంచితున్
హరిఁగని మ్రొక్కి భూతతతియాతనిసన్నుతిఁజేసె నిట్టులన్. ౧౮

చ. జయము హృషీకనాథసురసత్తమ నీరజపత్రలోచనా
జయము సమస్తపాపహర సర్వగతానిఖిలాత్మకాహరీ

జయమువిభూతిరూపధర సత్యనిరంజన నిర్వికార చి
న్మయ భవదీయపాదనవినమ్ములఁ ద్రొక్కెదమేము నిచ్చలున్.

చ. జలజభవేశ్వరేంద్ర ముఖసర్వసుపర్వులు దేవదేవనీ
వలన సముద్భవింత్రు మఱివర్ధిలుచుంద్రులయింత్రుయుక్తవే
ళలనిఖిలంబునీవ నిఖిలంబుననీవఖిలంబు నీదు లో
పలనిఖిలాభిధేయ భవభంజక గైకొనుమా నమస్కృతుల్. ౬౦

క. హరినివ్విధిభూతమ్ములు
కరమున్గొనియాడిమస్తక స్థాంజలులై
వరమానసముద్రఁ గైకొని
పరమాత్మ సమీపమందుభయమున నిలిచెన్. ౬౧

క. పరమాత్మ భూతములపైఁ
గరుణామృతపూర్ణదృష్టికాంతులు మెఱయన్
దరహాసితవదనుఁ డగుచున్
సరగున నొకమాటఁబలికె జలజదళాక్షీ. ౬౨

శా. ఈసృష్టిందవులాట మొందినను మీకెక్కాగ్రచిత్తంబునన్
నాసేవంబొనరింపఁగల్గదనుచున్ నాసన్నిధానంబునన్
వాసంబుండదఁటంచు జిత్తమరిషడ్వర్గాలయమ్మానఁటం
చీసృష్టిన్విడినారుగా వినుఁడు నాయీమాటనో భూతముల్.

సీ. అఖిల ప్రపంచంబున స్వతంత్రమఁటంచు
స్వాతంత్ర్య మొక పరబ్రహ్మదనుచు
కంజాక్షుప్రీతికై కర్మసేయుదమంచుఁ
దత్కర్మఫలము నాతనిదెయంచు
కర్తృత్వమును మాది కాదు వానిదెయంచు
స్వామిపాదము మాకు శరణమంచు
బ్రహ్మమే సర్వహృత్పద్మ సంస్థమఁటంచు
మాయనాతఁడెత్రిప్పు మనుజునంచు

గీ. నమ్మి మత్కీర్తనధ్యాన నతులుగల్గి
యెంతసంసారియును ముక్తికేఁగుఁగాన
నింక నాయాజ్ఞ శిరసావహించి మీరు
సృష్టికార్యంబుల ప్రవర్తింపవలయు. ౬౪

క. వేయేలవినుఁడు మీరిటు
నాయాజ్ఞనతిక్రమించి నడచితిరేనిన్
మీయాజ్ఞానము నిష్ఫల
మై యేగునుగాన మత్పరాయణులగుచున్. ౬౫

క. ఈయఖిల స్వాతంత్ర్యం
బాయన దేయంచు మత్పదాబ్జయుగమునన్
బాయని భక్త్యతిశయమునఁ
జేయుఁడు భూతములులోకసృష్టిక్రియలన్. ౬౬

వ. అని పలికిన శ్రీహరి వాక్యంబుల విని పంచభూతంబులు భగవ
త్పాదంబులఁ కెఱఁగి "స్వామీ మాయందక్కటికమూని భవ
త్సాన్నిధ్యంబు ఘటించునటుల భగవత్కైంకర్యంబు మాకొసం
గి యుష్మత్సాధనభూతులమయిన మే మేలినవారికేలుందమ్ముల
నుండునటుల మాకు వరం బొసంగినఁ దమ యానతికిం దల
యొగ్గి వైళంబసృష్టికార్యంబునం బ్రవర్తింతుము" అని పలికిన
వాని భావమెఱింగి శ్రీరమాకాంతుండు వెండియు భూతంబుల కి
ట్లనియె. ౬౭

గీ. నేనె సంకల్పమాత్రాన నిఖిలదుష్ట
సంహృతింబొనరింపఁగఁ జాలియున్న
సమలపంచాయుధ స్వరూపములుమీకు
నొసఁగినాచేతులందు మిమ్ముంచికొందు. ౬౮

గీ. మీమనోరథసిద్ధికై మీకృతమున
సర్వసంహారకార్యంబు సలుపుచుందు

ననుచు హరిపల్క ధరణిగదాయుధముగ
నయ్యెఁ గౌమోదకీ సమాఖ్యాకముగుచు. ౧౯

గీ. శంబరము పాంచజన్యాఖ్యకంబువయ్యె
వహ్ని యయ్యె సుదర్శనాహ్వాయసుచక్ర
మనిలతత్త్వంబు శార్ఙాఖ్య ధనువునయ్యె
గగనతత్త్వంబునందకఖడ్గమయ్యె. ౨౦

చ. పరమకృపాసముద్రుఁడును భక్తపరాయణుఁడైన శ్రీపరా
త్పరుఁడటులాయుధాకృతులఁదాల్చిన భూముఖతత్త్వరాశికిన్
వరములనెందుగా నొసఁగిపల్కెను "భూతములార మీరు నా
కరముల సర్వదా నిలువఁగావలె నాయుధరూపధారులై." ౨౧

గీ. వలసినప్పుడు పురుషరూపములు దాల్చి
సర్వవిధముల నా సేవ సలుపవలయు
నెన్ని రూపంబులను నేధరించుచుందు
నన్నియును మీరు నాతోడ నందవలయు. ౨౨

ఉ. నమ్ముఁడు నాదులోకముల నాయవతారములందు నెన్నడున్
మిమ్మును బాసి నేనిలువ మీరును నన్నెడఁబాసియుండఁబో
రిమ్ముదమీదుభక్తికిని నేఁ గడుమెచ్చితి మీదు మీదు రూ
పమ్ముల నంతరాత్మనయి వాసముసేయుదు మీదుచెంగటన్. ౨3

గీ. శ్రీనికేతనుఁడటు వెఱ్ఱివానిచేతి
జాతిపగిది వరములీయ భూతచయము
తరుణమిదెయంచు మఱియొండువరముఁగోరె
సందుదొరకిన నెవరూరకుందు రబలా. ౨౪

క. మాకీక్షేత్రంబుననే
ప్రాకటముగఁ దపముసిద్ధిబరఁగుట చేతన్
లోకేశయంశ భేదము
గైకొని మననిచటనుండఁగావలె నెపుడున్. ౨౫

క. ఆమాటకియ్యకొని హరి
మీమాటలు సెల్లునింక మీరుననాతో
నీమాన్య క్షేత్రంబున
నేమంబుననుండుఁడనుచుఁ జెప్పి యిటులనెఁ. ౭౬

సీ. ఓసుదర్శన చక్రమా సరోజభవాండ
మీల్గునంతటిదాఁక నిచటనేక
యోజనమితమైన యుర్విపై క్షేత్రత్వ
మొందినీవువసింపు మందముగను
నీనాభినడుమనే నిల్తునాభికిఁబైన
శివభారతీపతు ల్వెలఁగుచుంద్రు
నేమ్యష్టభాగాల నిల్తురష్టదిగీశు
లరములకొనల సర్వామరఘు

గీ. లుంద్రునీజ్వాలములయందు నొప్పమీర
వేదశాస్త్రపురాణము ల్వెలయుచుండు
ననుచుఁ జక్రంబునకు హరియానతిచ్చి
యంతనిత రాయుధములతో ననియె నిట్లు. ౭౭

గీ. వినుసుదర్శన హేత్యంతమునకు యోజ
నాన్తరమ్మునదూర్వగా నఖలమణివి
భూషణాంచితవగుచుఁ గౌమోదకీ, వ
సింపవలెనీవు మత్పాద సేవకొఱకు. ౭౮

గీ. శంఖమానీవు చక్రాపసవ్యభాగ
మందునొక యోజనాంతరమందుఁ గోటి
చంద్రధిక్కారి విద్యుతిశాలివగుచు
నుండఁగావలె బ్రహ్మాండముండువఱకు. ౭౯

క. చాపమ చక్రాయుధమున
కాపడమటిదెసను యోజనాంతరమున నీ

వేపుగనుండుము జ్యావ
ల్లీపరిచిత కోటివయిచలింపనిభర్తీ. ౧౦

క. నందకమాసుజ్ఞానా
నందాత్మకమగుచు నీవనారత మిచటన్
బొందుగఁ జక్రోత్తరదిశ
యందున్నిలుమొక్క యోజనాంతరమందున్. ౧౧

ఉ. ఇమ్ముగఁదీర్థయాత్రకయి యిచ్చటకేగినవారు ముందుగా
మిమ్మునుగొల్చి శుద్ధులయి మీపరిపూర్ణకటాక్షమందియా
పిమ్మటనన్నుఁగొల్తురని ప్రీతిమెయి న్వరమిచ్చియంతవే
గమ్మునశ్రీమనోహరుఁడు గాంచనవేదికఁజేరెఁ గోమలీ. ౧౨

క. హరియానతిచొప్పున నా
యరిముఖసర్వాయుధముల్ లాయాదెసలన్
దిరముగనుండె విరించియు
బిరబిరదన గృహముసేరెఁ బృథ్వీంద్రసుతా. ౧౩

చ. పొలుపుగఁ దీర్ఘయాత్రకయిపోయినమానిసి ముగ్గదాదిహే
తులసమరేశుల న్నుతులతోఁగని పిమ్మటవెన్నునిన్ గనన్
వలెను దదాదిగాఁగలిగె వారిజలోచన చక్రరూపమా
స్థలమునకింక దేని వినుదానవువేగమెపల్కు పల్కెదన్. ౧౪

క. సృష్టిస్థితిలయ కారణ
శిష్టజనావన, రమేశ, శేషశయన. శ్రీ
ముష్టాదిస్థిత, భక్తా
భీష్టప్రదభావదేవ భీతార్తిహరా. ౧౫

సుగంధి. శక్రముఖ్యదేవ చక్రసన్నుతాంఘ్రినీరజా
విక్రమాగ్ని సాత్కృతేంద్ర విద్విషన్మహాభుజా

నక్రరాజఖండనావినమ్ర కల్పభూమిజా
చక్రనందకాది హేతి సంతతోల్లసద్భుజా. ౭౬

గద్య. ఇది శ్రీహయగ్రీవకరుణాపాత్ర కృష్ణాచార్యపౌత్ర వేదవ్యాసాచార్య పుత్ర న్యాయశాస్త్రప్రవీణ సంగీతకళాపారీణ బాలసరస్వతీబిరుదభ్రాజమాన శతావధానాశుకవితా విరాజమాన సకల విద్వద్విధేయ కాశీకృష్ణనామధేయప్రణీతంబైన గోష్ఠీవనమాహాత్మ్యంబునందు చతుర్థాశ్వాసము సంపూర్ణము. ౭౭

# పంచమాశ్వాసము.

క. శ్రీభావదేవదివ్య
ప్రాభవ వేదాంతవేద్య పద్మజముఖ దే
వాభీష్టదాయకాఖిల
వైభవసముపేత సర్వవాచాతీతా. ౧

గీ. దేవయవధారు పార్వతీదేవి యంతఁ
బావనంబైన యీగోష్ఠితావనమున
దీపదాన మహత్త్వంబు దెలుపుమంచుఁ
బతిని వేఁడిన నాతఁడీపగిదిఁ బల్కె. ౨

గీ. దేవి యీక్షేత్రమున నొక్కదివ్వె నేని
బెట్టువారికిఁగలఫల మిట్టిదనుచు
నెవరుఁబల్కఁగలార లేనీ విషయము
నందు నొకకథ సెప్పెద నాలకింపు. 3

క॥ తపమునకు నిక్కసత్యా
లపనమునకుఁబట్టు విజయలక్ష్మికిని విటుం

డపరిమిత ధర్మశీలుఁడు
నృపకుంజరుఁ డొకరుఁ డంబరీషాఖ్యుఁడిలన్॥ ౪

మ॥ కలఁడిక్ష్వాకుకులావతంసుఁడగు నాక్ష్మాపాలచంద్రుండు స
త్ఫలదంబౌ నొకయశ్వమేధ మొనరింపన్ దీక్షితుండై ధరా
తలముం జుట్టఁగ గుఱ్ఱము న్విడిచినన్ దద్యజ్ఞగంధర్వముల్
బలశత్రుండు హరించి స్వర్గపురిలో నంగట్టి పెట్టెన్ సతీ॥ ౫

గీ॥ ఈసమాచారమును బురోహితు లెఱింగి
జన్న మాపఁగి రాదింక సత్వరముగ
నేగి పశ్వర్థ మొకవిప్రునీవు సొమ్ము
లిమ్ము పొమ్మనన్ నృపుఁడు రయమ్ముతోడ॥ ౬

చ॥ అరదమునెక్కి భూతలమునందలి మౌనివరాశ్రమంబులన్
దిరుగుచు రానురా నొకప్రదేశమునన్ భృగుతుఁగమన్మనో
హరమగు నాశ్రమంబుగని యచ్చట భార్గవుఁ డౌరుచీకునిం
దరిసెన మాచరించి మునినాథునికిం బ్రణమిల్లి యిట్లనెన్॥ ౭

క॥ ఇమ్ముగ మునివరయొక జ
న్నమ్మొనరింపంగఁ దలఁచినాఁడను బశ్వ
ర్థమ్మై తెంచితి మీసుతు
నమ్మన మీకిత్తు లక్షయావుల ననినన్॥ ౮

గీ॥ పెద్దకొమరునిపై నాకుఁ బ్రేమ పెద్ద
యాటనేనీయ నాతని ననుచుఁ దండ్రి
యటులనే చిన్నసుతునీయ ననుచుఁ దల్లి
చెప్పమధ్యముఁ డగు శునశ్శేపుఁ డపుడు॥ ౯

క॥ జననీజనకుల తలఁపుం
గనిపలికె, ధరాతలేంద్ర, గ్రక్కున నీతోఁ
జను దెంతుఁ బశువునై గో
ధనమును మాజనకులకును దయసేయుమనన్॥ ౧౦

క॥ ఘనగోధనము శునశ్శే
ఫునితలిదండ్రులకొసంగి భూవిభుఁడంతన్
దనవెంటనాశునశ్శే
ఫునిఁ గైకొనికదలెనాత్మపురమున కబలా॥ ౧౧

గీ॥ అంతమధ్యాహ్నసమయంబునందు నాత్మ
మాతులుండైన గాధేయ మౌనికడకుఁ
జేరి శరణంచు నాశునశ్శేఫుఁ డఖిల
వృత్తమాఁ మేనమామకు విశదపఱచె॥ ౧౨

శా॥ మామా నా తలిదండ్రు లెంతయనుకంపాహీనులోకంబె నీ
వే మేల్నాకొనరింతు విప్పుడని నిన్నే నమ్మి నేవచ్చితిన్
నా మాంతాపితృవర్గమీవయిఁ కనన్ రక్షించి యీఱేనికిన్
సేమంబొప్పఁగఁ సప్తతంతుఫలముం జేకూఱఁగాఁ జేయుమా॥

క. అనిపల్కు నా శునశ్శే
ఫున కభయమొసంగి మౌనిపుంగవుఁడంతన్
దనపుత్రశతము నిటుర
మ్మని వారికిఁ జెప్పె నా సమస్తచరిత్రన్. ౧౪

చ. తనుభవులారమీరనఁగ ధర్మమునం గడుఁ బెద్దలీధరే
శుని మఖమందు మీరలు పశుత్వమునొంది మదాజ్ఞచేత నీ
ఘనునకుఁ బ్రాణముల్నిలుపఁగావలె దాన నిలింపులెల్లరున్
మనములఁ దృప్తినొందుదురు నాకునుసంతసమౌనుజుమ్మనన్॥

క॥ విశ్వామిత్రంబనఁదగు
విశ్వామిత్రమునిపల్కు విని వెంటనెయా
విశ్వామిత్రతనూజుల
నశ్వరగర్వమునఁ దమ జనకునని రిటులన్॥ ౧౬

చ. తనయులఁజంపుకోలనెడు ధర్మువుభూస్థలినీకతోఁచె నీ
పని కడులోకగర్హితము పాఱుఁడ యీపనికంటె నొక్క కు

కక్కను భుజియింప నుత్తమముగాదె యన న్మనిరోష భీషణే
క్షణుఁడగుచుఁ దనూజుల కొకానొక దారుణవాక్య మిట్లనెన్॥

ఉ॥ నావచనంబు కాదనుచు నన్నిటుదూరిన మీరు చౌర్య హిం
సావిహృతిన్ శ్వమాంసమును సాపడుచు న్సతతంబుమాలలై
త్రోవలగొట్టుచు న్సుకృతదూరులు ధర్మవిహీనులౌచు నీ
భూవలయాన వేయిసమము ల్వసియింతురుగాత భ్రుచ్చులై॥

క॥ పుత్రుల నీగతి విశ్వా
మిత్రుఁడు శపియించి యంత మేనల్లుని ప్రా
ణత్రాణార్థ మొసంగెఁ బ
విత్రంబగు నొక్క మంత్రవిద్య నతనికిన్॥ ౧౯

శా॥ ఆరీతిన్ జనకుండుదిట్టిన మధుష్యందాది మహాన్యాత్మజుల్
ఘోరంబౌ శ్వపచత్వమొంది ద్విజతం గోల్పోయి దుష్పాతకా
ధారంబైన కిరాతదేశమున నిత్యప్రాణహింసేచ్ఛులై
చోరత్వం బొనరించుచుండి రధికక్షోభంబుగావించుచున్॥ ౨౦

క॥ ఓతరుణీపంచమహా
పాతకముల నొకఁడొకండు పదిపదివేలన్
ప్రీతినొనర్చిరివారుప
పాతకములనెన్న నంతుబట్టదెవరికిన్॥ ౨౧

క॥ ఈగతి బహుతిథకాలం
బేగఁగఁజండాలురైన ఋషిపుత్రులు వే
వేగఁజని యాంధ్రదేశము
లోగల ధనమెల్ల ప్రుచ్చిలుచు నొకనాఁటన్॥ ౨౨

గీ॥ పారమాత్మ్యంబునందున్న భావదేవు
మందిరంబునఁగలవెన్నొ మానికములు
వివిధభూషణములునంచు వినుచువారు
వాని ప్రుచ్చిలనచటికిఁ బయనమైరి॥ ౨౩

క॥ పావనతమమగు నాగో
ష్ఠివనముం జేరి వారు శ్రీనిలయుని సా
త్త్వవిధిం జిక్కనో యనిమది
వించుచుం గాంచి రొకయుపాయంబబలా॥ ౨౪

గీ॥ తమకదృశ్యత్వ సంసిద్ధి తనరునట్లు
మహితమంత్రౌషధులచే నమర్పఁబడిన
సిద్ధవర్తిని నొకదానిఁ జేసి దాని
సాయమునఁ జౌర్యకృత్యంబు సలుపఁదలఁచి॥ ౨౫

చ॥ అరిగి రిసిద్ధవర్తి కరమందుధరించుచు వారు దేవ మం
దిరమున కేరి కేనియును దృష్టికి గమ్యులుగాక వర్తిచేఁ
గరమున దివ్వెఁబూని యటఁగల్గినశాలలల నన్నిటిన్ బరా
బరికగఁగాంచి రీశ్వరుని భాగ్యము ముచ్చిలఁగల్గు వేడుకన్॥

క॥ ఇటులాహరిగృహమునఁ బ
ర్యటనముఁగావించి రొక్కయామమువఱకు
తక్కటుదీపహస్తులై యుం
తట నా నూర్వురియఘంబు దగ్ధంబయ్యెన్॥ ౨౭

క॥ ఓపార్వతి వినువారలు
పాపంబులవీడి పూర్వభావాశ్రితులై
శ్రీపతిమంటపసన్నిధిఁ
బ్రాపించుచుఁగాంచిరా పరాత్పరునచటన్॥ ౨౮

గీ. హరినిదరిసించి సాష్టాంగమాచరించి
యుపనిషద్వాక్యసమితిచే నొప్పమీఱ
సామిఁగొనియాడి తలల నంజలులొనర్చి
మానులో వారికిట్లనె మాధవుండు. ౨౯

చ. ఇల శతకోటికల్పముల కేనియుఁ దీరనియట్టి మీ యఘ
మ్ములు నొకయామమాత్రమునఁబోయెను సుమ్మిట దీపశక్తినీ

స్థలమున నీలగోఘృతయుతంబుగ మీారొకజాము దీపముల్
వెలుఁగఁగనుంతు రేని గడు వేగమె కాంతురు నాదుసన్నిధిన్. 3౦

క. అన విని విశ్వామిత్రుని
తనుజన్ములు కపిలగోఘృతసహితపాత్ర
మ్మున వత్తినునిచి దీప
మ్మును హరికర్పించి గనిరి మోక్షపదమ్మున్. 3౧

క. వంతసమునవిని పార్వతి
కాంతునిఁగని "యుత్సవప్రకారము, యాత్రో
దంతము వినఁదలఁచితినో
కాంతా వచియింపుమనిన గౌరీశుఁడనెన్. 3౨

చ. మునుపొకసాక్షి వాదమునుబూనుచు శ్రీహరిపారమాత్మ్యమున్
జనిన యనేకదివ్యదివసంబుల కొక్కకదినంబునందు నా
వనజభవుండు విష్ణుఁగనవచ్చి పరాత్పరు నుత్సవంబులన్
గొనకొని చేయఁబూనెనటఁ గోమలి మాధవమాసపూర్ణిమన్.

క. ఈరేడుజగములందల
వారలఁబిలిపించె నుత్సవముదరిసింపన్
సారససంభవుఁడంతకు
మీారిన దేమున్నదింక మేదినినబలా. 3౪

గీ. కామధేనువుఁబిలిపించి కమలభవుఁడు
తనదుసంకల్పమంతయు దానికపుడు
దెలియఁబఱచుచు నటనెల్ల దెసలనున్న
వారిఁజూపించి యొకమాటఁబలికెనిటుల. 3౫

చ. వినుము సమస్తలోకముల వేల్పులు మానులు ఱేండ్లు పూరుషుల్
వనితలు బాల వృద్ధులును వారును పీరననేల గోమణీ
వనజభవాండమంతయును వ్రాలినదిచ్చట నుత్సవార్థమై మీా
యనఘులకు న్సుధారసమయాన్నము పానము నీవొసంగుమా.

ఉ. వారిజసంభవుండు గృహపంక్తులొనర్పఁగ విశ్వకర్మనున్
గోరినవారికందఱికిఁ గోరినవి త్తమునీయ శ్రీదునిన్
శ్రీరమణోత్సవాదు లొనరించుట కర్హములైన వైదికా
చారములన్విధింప మునిసత్తముల న్నియమించెఁ గోమలీ. ౩౭

క. గరుడస్తంభమ్మునవిధి
గరుడధ్వజబంధనమ్ము గావించెమునీ
శ్వరుఁడై నయత్రితోడుత
బరమమ్మగు శుక్లపుమ్యాభమ్మున నచటన్. ౩౮

క. అత్రిముఖఋషులతోఁ గుం
డత్రయమునఁ బద్మజుఁడు హుటాహుటిగా న
గ్నిత్రయమునిలిపి పరమప
విత్ర హవిర్ద్రవ్యములను వేలిచెనబలా. ౩౯

సీ. తగినంత యన్నప్రదానమ్ము లొకచోట
హోమధూమసుగంధ మొక్కచోట
ఘనమైనగంధర్వ గానమ్ములొకచోట
నచ్చరల్ సేయు నృత్యంబులొకట
వేదశాస్త్రపురాణ నాదమ్ములొకచోటఁ
గలహప్రియుని వీణగాన మొకట
దక్షిణాతాంబూల దానమ్ములొకచోట
స్రక్చంద్రరసగంధ చర్చలొకట

గీ. షడ్రసోపేతభోజన సమయజాత
విష్ణుకీర్తనగాన గోవిందలొకట
గలిగి చెలువొందె నుత్సవకాలమందు
జరుగు సంతర్పణాదుల చక్కఁదనము. ౪౦

చ. వనజభవుండునంత భగవానుని జన్మభమావిశాఖయం
దనుపమరత్నతోరణ సమంచితమైన రథోత్తమమ్ముపై

దినమణిచంద్రలోచను నధిష్ఠితుఁ జేసి మహోత్సవమ్ములన్
బొనరిచె శర్వదేవ మునిపుంగవు లచ్చెరువందిచూడఁగన్. ౪౧

ఉ. బమ్మసుపర్వమాని నృపపన్నగకిన్నర యక్షమర్త్య సం
ఘమ్ములఁగూడి యుత్సవ మఖండముగా నొనరించి చాల నం
దమ్మగురీతితో నవభృథమ్మొనరించి సుపర్వమాని మ
ధ్యమ్మున నిల్చి విష్టపహితమ్ముగ నొక్కటిఁబల్కె నిట్టులన్. ౪౨

గీ సర్వజనులార యిప్పుడు జరిగినట్టి
యుత్సవమునకుఁ బేరు బ్రహ్మోత్సవంబ
టంచు బ్రహ్మాండమందు బ్రఖ్యాతిగాంచు
దీని గనువారి పాపముల్ దెరలిపోవు ౪౩

మ. ధర నీయుత్సవదర్శనార్థమయి యే ధర్మాత్ము డేతెంచునో
స్థిరనాతండిదు పాదపాదమున జ్యోతిష్టోమయాగోద్ధ ని
ర్భరపుణ్యంబును బొంది యైహికసుఖాస్వాదంబుచేఁ దృప్తుఁడై
దురితధ్వంసముగాఁగఁ జుట్టతుద ముక్తుండై ప్రకాశించెడున్.

క. ఉత్సవకారయితనుభగ
వత్సముఁగాఁ జూచు నెట్టివాఁడును నే బ్ర
హ్మోత్సవమొనతుఁ ననుకొను
మత్సన్నిధినుండునట్టి మనుజుం డెపుడున్. ౪౫

గీ. ఒక్కవస్తువునేనియు నుత్సవమున
కర్పణముచేయుమనుజుఁ డనంతముగను
పుత్రపౌత్రాదిసుఖములఁ బొందితుదకు
భవమువిడనాడి శ్రీవిష్ణుపదవినొందు. ౪౬

క ఉత్సవకర్తలఁ బొగడువా
రుత్సవముల జేయువార లుత్సవమునకుం
బ్రోత్సాహ పెట్టువారును
మత్సన్నిధిఁగాంచెదరు సమస్తసుఖములన్. ౪౭

క. బ్రహ్మోత్సవస్మరణమున
బ్రహ్మసరఃస్మరణమునను బాపములడఁగున్
బ్రహ్మోపగోష్ఠమబ్బును
బ్రహ్మపదవిగలుగు సర్వభక్తవరులకున్. ౭౮

చ. ఇతరదినంబులందుఁ బరమేశ్వరుఁ గాంచుటకంటె నుత్సవో
న్నతసమయంబునన్ హరిఁగన న్ఫలమబ్బును గోటిరెట్లుఁటం
చతిముద మొప్పఁజెప్పి కమలాసనుఁడంతట దేవదానవసం
తతి తనవెంటరాఁదనదు ధామముఁజేరె హిమాద్రిపుత్రికా. ౭౯

గీ. తరుణివిను పారమాత్మ్యయాత్రావిధాన
మెల్లవివరించిపల్కెద నింపుమీఱ
శ్రద్ధతోడుతవినఁ జిత్తశుద్ధిగల్గి
యెంతపాపాత్ముఁడును బుణ్యవంతుఁడగును. ౮౦

గీ. ఎవఁడు గోష్ఠీవనికినేగ నిచ్ఛగించు
నతఁడు విజితేంద్రియుండయి యాదినమున
స్నానసంధ్యాదికృత్యముల్ సలిపిచేయ
వలయుసంకల్ప మాత్మహృద్వనజమందు. ౮౧

సీ. అంతదేవునిపూజ నాచరించిశిరంబు
నందు నంజలిఁజేసి యాదరమున
గోవిందయిమ్మునీ గోష్ఠినాకనిభావ
దేవునానతిముందు దీసికొనుచు
పెద్దలయానతిఁ బిదపఁగైకొనియిల్లు
వెడలిచిత్తమున గోవిందునిల్పి
సరణిలోపలబ్రహ్మ చర్యాదినియమంబు
లాచరించుచుఁ బారమాత్మ్యభూమి

గీ. గాంచిమ్రొక్కిఁడి ద్వారంబుగాంచియంత
నచట సాష్టాంగనమనంబు లాచరించి

తుంగభద్రకుఁ జేరి యుత్తుంగభక్తి
నామహానది నిటుకొనియాడవలయు. ౧౨

క. శ్రీవిష్ణుబాహుతలమున
నావిర్భావంబునొంది యంతట శ్రీ గో
ష్ఠీవనిఁ బాఱుచునుజగ
త్పావనమొనరించు తుంగభద్ర నుతింతున్. ౧౩

గీ. అంత నదిలోనమునింగి చక్రాంతమందు
నొక్కయామడదూరాన నున్న గదను
జ్వాలలందున్న యింద్రాది సకలసురులఁ
బూజలొనరించి ద్విజునకు భూమినొసఁగి. ౧౪

క. అరిదక్షిణభాగమ్మునఁ
బరఁగెడు శంఖమ్ముగొలిచి బ్రహ్మణ్యునకుం
బరమాదరమున మనుజుఁడు
పరమాన్నమువెట్టి తృప్తిపఱుపఁగవలయున్. ౧౫

ఉ. అచ్చటనున్న శాస్త్రముల కన్నిఁటికర్చనొనర్చి భక్తిచే
హెచ్చుగనీరధారలఁ బిత్రుప్రతతిందనియించి పూవులం
దెచ్చి ప్రతీచినున్నహరి దివ్యశరాసనపూజసల్పుచున్
వెచ్చమువెట్టఁగావలయు విప్రుల కుత్తమ వస్త్రసంతతిన్. ౧౬

తే. చక్రపశ్చిమ దిగ్గతజ్వాలలందు
రాణనొప్పారుచున్న పురాణములను
దివిజులనుగొల్చి యంతనుదీచికేగి
నందకార్చనఁజేసి యానందమొప్ప. ౧౭

క. పావనులగు బ్రాహ్మణులకు
నీవలయుసువర్ణమచటి స్మృతులకుఁబూజల్
గావించి యురములంగల
దేవతలన్గొల్వవలె సతీమణి యంతన్. ౧౮

క. చక్రాష్టాశాస్థితసుర
చక్రము సేవించి దానసంపత్తిని ని
ర్వక్రగతిఁ జేసి యంతటఁ
జక్రపు నడిబొడ్డుకడకుఁ జనవలెనబలా. ౫౯

ఉ. నాభిచతుర్దిగంతగత నారదపద్మభవాత్రి రుద్రులన్
శోభదలిర్ప బత్తిమెయి షోడశపూజలఁగొల్చి వెండియున్
నాభికిఁ బ్రాచికేగి కడునమ్రత భద్రనుగొల్చి యచ్చటన్
బ్రాభవమొప్ప దానము లపారముగా నొనరింపగావలెన్. ౬౦

గీ. ఘనతఁ జక్రాకృతి క్షేత్రమునకుఁ బూజ
సలిపి యానతిఁగొనుచు నాచక్రమధ్య
మునకు నేగుచు మానవు ల్మోదముతోడ
స్థండిలమ్మున దేవతాతతినివ్రాసి ౬౧

సీ. ఆదేవతల కెల్ల నర్చనంబొనరించి
యంత సదానందమను విమాన
మును మ్రొక్కి తన్మధ్యమున నున్న నవరత్న
మంటపమ్మునుగాంచి మహితభక్తి
తన్మధ్యమున నవ్యతరణిసన్నిభమైన
పంకజమ్మునుగాంచి భక్తి మ్రొక్కి
దానిలోఁ జక్రగదాధరుండును దివ్య
పీతాంబరధరుండును పృథులదివ్య

గీ. భూషణుండుసహస్ర నభోమణిప్ర
కాశభాసురుఁడును గోటికామసముఁడ
నంతగరుడాది నిత్యముక్తార్చితుండు
నగుచుఁ జెలఁగెడి హరి మ్రొక్కి పొగడవలయు

ఉ. అంతట భావదేవ చరణాంబురుహద్వయ పూజసల్పి పూ
జాంతమునందు వస్త్రముల నాభరణమ్ముల హేమరాసులన్

గాంతలతాంతసంతతుల గంధములన్ హరికప్పగించి ని
శ్చింతగ నోదనార్పణముఁ జేయవలెన్ సుపవిత్రమాగతిన్. ౬౩

ఉ. “సర్వశయాన, నాతనువు, జాయయుఁ బుత్రులు మందిరంబు నీ
కర్పితమయ్యెఁ గైకొను మదాత్మయునీయది” యంచుఁ గోటికం
దర్పసమానుఁజిత్తమున నమ్మినవారల కీభవాబ్ధి సం
సర్వణమిల్లెవింటికద చానరొ యాత్రవిధానమంతయున్. ౬౪

క. ఈరీతిగ నెవ్వండా
త్మారాముండౌచుఁ దీర్ఘయాత్రనొనర్చున్
గారీయాతఁడుసాక్షా
న్నారాయణుఁడౌచు నిస్తులానందుఁడగున్. ౬౫

క. యాత్రావైభవమునువిన
యాత్రాఫలమబ్బుమఱియు నైహికమును బా
రత్రికముఁజిక్కు ముక్తికిఁ
బాత్రతయున్గల్గు సర్వభక్తవరులకున్. ౬౬

గీ. ధరణిధరజాత! తీర్థయాత్రావిధాన
మంతయునువిని గోష్ఠీవనాంతరమునఁ
జేయువలసినదానము లెప్పుమనుచు
భవుని వేడఁగ నాతఁడీవగిది నుడివె. ౬౭

క. మానినిమును దీపాదన
దానఫలముఁజెప్పితిన్గదా యిఁకఁదక్కు
దానములఁబల్కెదనువిను
దానం జేకూఱు సర్వదానఫలంబుల్. ౬౮

క. పరమాద్భుతమహిమంబున
బరఁగెడు శ్రీవిష్ణువునకుఁబరమప్రీతిన్
వరకాంచనం బొసంగిన
నరవరు లరుదెంత్రులోకనాధపదంబున్॥ ౬౯

గీ. పచ్చనౌపట్టువస్త్రముల్ భక్తితోడ
మాపతికిఁదెచ్చి యర్పించుమనుజవరులు
పూర్ణమానాయువును బొందిపొలుపుమీర
విష్ణులోకంబునందెప్డు వెలయుచుంద్రు॥ ౨౦

క॥ లలితములగు పూవులుని
స్తులభూషణములహారతులసీదళము
ల్నలినాక్షునకర్పించిన
గలుగున్ సారూప్యముక్తి కంజదళాక్షి॥ ౨౧

క॥ చారుతరచంద్రరసకా
శ్మీరాగురుసంకు మదవిశేషసురభిక
స్తూరీయుత ధూపమ్మును
శ్రీరమణునకీయ ముక్తి చేకురునబలా॥ ౨౨

ఉ॥ శారద చంద్రతుల్యమగుఛత్రము, వీవన, చామరంబులున్
మారునిగన్నయయ్యకు సమర్పణసేసిన మానవుండువి
స్తారముగాసమస్తసుఖ సంపదలొందుచువీతశోకుఁడై
సారసపత్రనేత్ర పితృసంతతితోడుత నేగుముక్తికిన్॥ ౨౩

గీ॥ పారమాత్మ్యస్థలంబున భక్తితోడఁ
కపిలగోదానమొనరించు ఘనుఁడుసర్వ
పాపములఁబాసి శ్రీశుసమీపమందుఁ
గాపురముండు నిత్యసౌఖ్యమ్ముఁగలిగి॥ ౨౪

క॥ పుడమిని వృషభంబును నె
వ్వాఁడుహరికర్పితముఁజేయుఁ బడతీవినుమా
తఁడుస్వానుభూతిగలఁడై
తడవేమియులేక, యమృతతన్ గనుచుండున్ ॥ ౨౫

సీ. హరిపూజకై యగ్రహారమిచ్చినవాఁడు
ముదితవిష్వక్సేనపదవినొందు

స్యందనాశ్వమతంగ జాందోళికాదుల
హరికీయనైన తేయుపదముబ్బ
హాగ్రమోలనృత్యగీతాదికమ్మొనరింపఁ
జేయఁబాతక రాశి సెల్లిపోవు
శయ్యాధ్వజపతాక శంఖఘంటాదాత
సద్జ్ఞానియై హరిసామ్యమొందుఁ

గీ. కేళిసౌధంబు కుసుమవనాళిధూప
దీపపాత్రలు తాంబూలదివ్యపేటి
మున్నుగాఁగలవస్తువుల్ ముదముతోడ
హరికినర్పింపదొరకును హరిపదంబు॥ ౭౬

గీ. అచటగాపురమున్న ధరామరులకు
వారిలోఁగూడ మద్భక్తవరులకొక్క
యణువునిచ్చిననదియె కొండంతదగుచుఁ
గోటిమడుఁగులు ఫలమిచ్చుఁగోమలాంగి॥ ౭౭

క॥ దానంబులలోఁగన్యా
దానముసర్వోత్తమంబు తరుణీవిద్యా
దానంబునట్టిదియభూ
దానంబుఫలంబు చెప్పఁదరమేనాకుఁ॥ ౭౮

గీ. పారమాత్మ్యమునందున్న బాపనయ్య
కెట్టిదానంబులిచ్చిన నీయవలయు
నచట షోడశదానమ్ములధికభక్తి
సలిపిగతలింగులైముక్తిసరణిఁగాంత్రు॥ ౭౯

గీ॥ "అస్మదాత్మజుఁ డొకదినమందునేనిఁ
బారమాత్మ్యంబునందు సపార్వణముగ
శ్రాద్ధమొనరించునా" యంచుసంతతంబు
గోరుచుందురు పితరలుగోష్ఠియందు॥ ౮౦

క. తుంగాహారులకునడుమఁ
బొంగుచుఁ బార్వణవిధానమున నొకశ్రాద్ధం
బుంగావించినమనుజుని
కింగలపితృగణము ముక్తికింగదలుఁజుమా॥ ౮౧

క. వినుమీకథ హిమభూధర
తనయాద్విజబంధు వొకఁడు దత్తాఖ్యుఁడిలన్
జనియించెనానృశంసుఁడు
పోనరించెను బాతకములు పుట్లకుఁబుట్లన్॥ ౮౨

ఉ. ఆతఁడు బ్రహ్మహత్య గురుహత్యయు గోశిశుహత్యలన్మహా
పాతకములొనర్చుచు పపాతకకోటులనారితేరిహిం
సాతతవృత్తియైతుదకుఁ జావఁగఁదత్క్షణమేపరేతరా
డ్దూతలు వానిబట్టి పడఁద్రోసిరి దుర్నరకాగ్నికీలలన్॥ ౮౩

ఉ. వానితనూభవుం డమలభాగవతోత్తముఁ డంతఁదండ్రికిన్
బూనికతోడఁ బ్రేతవిధిఁ బూర్ణమొనర్చుచుఁ బారమాత్మ్యమున్
స్థానము జేరి భక్తిమెయి సారసలోచనుఁ బ్రొక్కి తుంగభ
ద్రానదినాడి తీరమున శ్రాద్ధమొనర్చెఁ బితాళ్ళతృప్తికై. ౮౪

గీ. అట్లు హరిపాద బద్ధహృదబ్జుఁడౌచు
నాత్మజుఁడు వత్సరవిమోకమాచరింప
నాఫలమ్మున జముని నిరాకరించి
దత్తుఁడరిగెను హరిసన్నిధానమునకు. ౮౫

గీ. తుంగభద్రాతటమున నుత్తుంగభక్తి
శ్రాద్ధమొనరించువారికి సంభవించు
ఫలముఁగొనియాడఁ గోటికల్పశతమునకు
నైన నాచేతఁగాదు పద్మాయతాక్షి. ౮౬

క. సేవాఫలమునుఁజెప్పెద
వావిధివినుసాక్షి దేవు నాలయమందున్

శ్రీవిభుని సేవ జేయుట
యేవనితా మోక్షమందు రిలవిద్వాంసుల్. ౮౭

క. వనజాక్షునిలయసమ్మా
ర్జనమొనరించినఁ బరాగసంఖ్యకుసరిగా
గనుగొందురన్ని మారులు
ఘనమగు శ్రీవిష్ణుపాద కంజములనరుల్. ౮౮

గీ. దేవదేవునిగృహమందు దినదినంబు
వారిసంప్రోక్షణము సేయ వసుధ నడఁగు
చున్న ధూళీపరాగంబు లెన్నొ యన్ని
మారులీశునిఁగాంతురు మనుజులబలా. ౮౯

క. గోమయమున హరిమందిర
మేమనుజుండలికి ముగ్గు లింపుగనిడునో
యామానవుండు సాక్షి
స్వామిగృహంబందు ముక్తవరుఁడైయుండున్. ౯౦

చ॥ హరి కభిషేకతీర్థముల నప్పన సేసెడువారు శ్రీమనో
హర తులసీసరంబుల సమర్పణముంబొనరించువారలున్
వరసరసాన్నపానముల వండెడువారును జందనాదులన్
హరికొఱకిచ్చువారును దురంతభవాబ్ధిమునుంగ రంగనా॥ ౯౧

ఉ॥ చారుతరప్రభాకలిత చామరయుగ్మము కేలఁబట్టెడున్
వారుసితాతపత్రమును, వాహనముంధరియించువారలున్
భూరితరోన్నతింగలిగి పొల్పగు కేతనమున్గరంబులన్
ధారణసేయువారలును దప్పక ముక్తిగాంతు రింతిరో॥ ౯౨

క॥ శ్రీజానికి నీవిధమునఁ
బూజాకాలోపచారమును జేయుచునీ
రేజాక్షి యెవ్వఁడేనిం
బోజాలును విష్ణులోకమునకు రయమునన్ ౯౩

క॥ గోపికలు కామవశతఁ
శ్రీపతిలోఁ గించుకొన్న రీతి నరుఁడుతా
నేపగిది హరినిఁగొల్చిన
నాపగిది న్భావమూర్తిఁ నందఁగవచ్చున్॥ ౯౪

గీ॥ క్షేత్రములలోన నుత్తమక్షేత్రమైన
పారమాత్మ్యంబునకు సరివచ్చుత వు
నర్థశతకోటి యోజనాయతధరిత్రి
యందు నెచ్చటఁ గనలేము మందగమన॥ ౯౫

ఉ॥ దీనిప్రభావముఁ మఱియు దీనికిఁగల్గిన యెల్ల పేరులఁ
దీనిసురూపసంపదను దీనఁజెలంగెడు దేవతావళిఁ
మానిని, భక్తితత్పరత మానసమందుఁ దలంచికొంటివేఁ
దాన సుసౌఖ్యముల్దమకుఁ దామఘటించును నీకు నిచ్చలుఁ.

క॥ ఓకాంత పారమాత్మ్య
ప్రాకటమాహాత్మ్య మొక్కపద్యం బేనిఁ
శ్లోకార్థపాదములనేఁ
ధీకలితతఁజదువ భవముఁదెగి ముక్తుఁడగుఁ॥ ౯౬

గీ॥ నేను జెప్పినదంతయు నిజము నిజము
వేదములలోన నుత్తమ వేదమైన
యట్టి ఋగ్వేదమున దానియంతమందుఁ
బారమాత్మ్యమహత్త్వంబు పలుకఁబడియె॥ ౯౭

క॥ ఆమంత్రమ్ములఁజక్కఁగ
నీమహిత క్షేత్రమందు నెవడుసదువునో
యామనుజుఁడు గతభవుఁడై
కామిని యమృతత్వమపుడ కాంచి వెలుంగుఁ॥ ౯౮

గీ॥ స్థలపురాణంబు సెప్పు విద్వాంసు నెవఁడు
పూజసల్పునో శ్రీశుఁడా పూరుషునకు

సంతసంబున నిహపరసౌఖ్యముల నొ
సంగి తుదకిచ్చు తనదు శాశ్వతపదంబు॥ ౧౦౦

క॥ పౌరాణికుఁడొ ద్విజు నె
వ్వా రవమానింతురట్టివారలు శ్రవణా
పారఫలంబునుబొందని
వారై బాధిర్యమెపుడు పడయుదురవనిన్॥ ౧౦౧

క॥ వినుగోష్ఠీవనమహిమన్
జనుఁడెవ్వఁడుసంశయించుఁ జానరొ వాఁడొం
దును ద్విజహత్యాపాతక
మును తత్క్షణమందెఁ బూర్వపుణ్యముఁదొలఁగన్॥ ౧౦౨

గీ॥ పారమాత్మ్యమహత్త్వ మెవ్వానియింట
గల్గునో యతఁడన్ని సౌఖ్యములనొంది
చింతలనుబాసి తుదకు శ్రీకాంతుపదము
నొంది వెల్గు నిరతిశయానందుఁడగుచు॥ ౧౦౩

గీ॥ ఎవఁడు గోష్ఠీవనమహత్త్వమెల్ల వ్రాసి
పొత్తమును జేసి యొక్కవిప్రోత్తమునకు
దానినిచ్చునో యాతఁడు మానివంద్యుఁ
డైన హరిఁ జేరి యానందమనుభవించు॥ ౧౦౪

చ॥ మనుజులు పారమాత్మ్యమహిమ న్స్మరియించిన విన్న వ్రాసినన్
ఘనతఁబఠించినన్ నిఖిలకల్మషనీల ఘనాఘనంబు లె
ల్లను బెకలించుకొంచు శుభలక్షణలక్ష్మితులొంచుఁ జందమా
నును బరిడించి వెల్గుదురు మానిని సర్వశిరోవతంసులై॥ ౧౦౫

మానిని॥ ధారుణి శంకరపుష్కరబాణ మితంబగు తుర్యయుగంబున సా
ధారణమాగన్ శిరోసితవిధ్యహతాప నిష్క్రసకరంబునఁ గా
శీ రుచిరాన్వయజాతుఁడు కృష్ణుఁడు చెల్వుగఁదెల్లునఁజెప్పిన గో
ష్ఠీ రమణీయమహత్త్వము పృథ్వివసించెడు నావిధుతారముగాన్

క॥ శ్రీసాక్షిదేవ, పద్మజ
కాసారతటప్రభాసి కాంచనపుర సం
వాసా, శ్రీభూనీలే
శా, సారసనేత్ర, యతిసన్నుతపాత్రా॥ ౧౦౭

పంచచామరము॥ సురాసురేంద్రమౌళిరత్న శోభిపాదసుందరా
దరారిచారుహస్త మంధధారుణీధరోద్ధరా
ధరాత్మజామనోహరా సదాతనాదయాపరా
పరాత్పరా సువర్ణపూర్నివాస సద్గుణాకరా॥ ౧౦౮

గద్య. ఇది శ్రీహయగ్రీవకరుణాపాత్ర కృష్ణాచార్యపౌత్ర వేదవ్యాసాచార్య పుత్ర న్యాయశాస్త్రప్రవీణసంగీతకళాపారీణ బాలసరస్వతీబిరుదభ్రాజమాన శతావధానాశుకవితా విరాజమాన సకల విద్వద్విధేయ కాశీకృష్ణనామధేయప్రణీతంబైన గోష్ఠీవనమాహాత్మ్యంబునందు పంచమాశ్వాసముతో సర్వంబును

సంపూర్ణము.

